# సృజన

మార్చి / ఏప్రిల్ 1985
161 / 162

కవిత

## మృత్యులోయ నా మాతృభూమి కాదు

కథనం

## ప్రజాస్వామ్యం

విశ్లేషణ

## విముక్తి ఉద్యమం – స్త్రీ
## ఒక అనుభవం

నిర్వహణ
సాహితీ మిత్రులు

96 పేజీలు

4 రూపాయలు

ఈ సంచికలో....




సృజన, హనుమకొండ 506 001 ఈ ప్రతి రూ.

సంవత్సర చందా రూ.

SRJANA is commended for use in Public Libraries in State by the Director of Public Libraries, Andhra Pradesh, H Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithr

Printed at Navatha Printers, J. P. N. Road, Warangal - 506

for Venkataramana Mudranalayam, Warangal

## ఎన్నికల మేడిపండు

ప్రజాస్వామ్యం చాలా విలువైనది. ప్రజల ఇచ్ఛ స్వేచ్ఛ అమలు కావడానికి కాశం కల్పించే ఒక అవసరం అది. కనుక విలువల దృష్ట్యా ప్రజాస్వామ్యం తి ఒక్కొరి వ్యక్తిత్వాను, చైతన్యాన్ని, చొరవనూ, సృజనాత్మకతనూ, భావుకతనూ, పుణ్యాన్ని పెంచే ఒక సమగ్రి సామాజిక నిర్మాణ రూపం గనుక అది మానవ యాలలో ఉన్నత ప్రమాణాలను సాధిస్తుంది. ప్రజల స్వామ్యం అమలయితే సమానత్వం కూడ నెలకొనదు.

అయితే మనది 'పార్లమెంటరీ ప్రజాస్వామ్యం' ఇది కూడ చాల విలువయి ! ఇందులో ప్రతిపాదింపబడే బడ్జెట్ వేలకోట్ల రూపాయల లోటుతో సామాన్య జానీకంమీద సామ్రాజ్యవాద రుణభారాన్ని మోపడమే కాదు ఇది ఏర్పడడానికి హించబడే ఎన్నికల యజ్ఞంలో సారా, పెట్రోల్. డబ్బు నరేసరి ఎన్నిప్రాణాలు యయిపోయాయో ఇటీవలి లోక్‌సభ, అసెంబ్లీ ఎన్నికలే ఎన్నో నోళ్ళతో చాటి .

డిసెంబర్‌లో లోక్‌సభ ఎన్నికలు జరిగినవి. మార్చిలో పది అసెంబ్లీలకు ్నికలు జరిగినవి. దాదాపుగా మళ్ళీ మినీ సాధారణ ఎన్నికలు. వీటిలో ఐదేళ్ళ ం పూర్తయి ఎన్నికలు నిర్వహించిన రాష్ట్రాలు వేళ్ళమీద లెక్కపెట్టదగినన్ని దా లేవు. ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రమయితే కేవలం కేంద్రంతో నువ్వా నేనా బలం చూపుకోవడానికే లోక్‌సభ ఫలితాల ధీమాతో మళ్ళీ ఎన్నికల సంరంభం వెళ్ళింది. బస్తీలో సవాల్ విసిరిన తెలుగు రాముడు ఢిల్లీ రాజీవ్‌కన్నా గడుసరి నిరూపించుకున్నాడు. కాని పందొమ్మిది జిల్లాల్లో కరువు, వేలాది గ్రామాల్లో చుక్క లేక తడారిపోయిన గొంతులు, బీటలువారిన నేల, విలయతాండవంచేస్తున్న ద్ర్యం.ఒకవంక. వీళ్ళ ఓటర్లు, వీళ్ళకు వాగ్దానాలు, ఎన్నికల కాలంలో సారా గల లక్షల ఖర్చు చేయగల అభ్యర్థులు ఒకవంక. అభ్యర్థుల ఆర్థిక, అంగబలం ర అసహాయ స్థితి- పెళ్ళి, పండుగ ఈ దేశంలో సంపన్నులకు పేదలకూ దే తేడాను వికృత ఆడంబరంతో బయటపెట్టినట్లు- కొత్తగా ఎన్నికలు ఒత్తి స్తున్నాయి. డబ్బు వుండడమే కాదు, అది ఎగజల్లడం తెలియాలి. ప్రచార ్యకర్తలు వుండడమే కాదు, వాళ్ళతో ఎన్నికలరోజు రిగ్గింగ్ చేయించడం తెలి లి. చేసిందానికన్నా చేసింది ప్రచారం చేసుకోవడం తెలియాలి.

ఈసారి ఎన్నికల సాధారణ లక్షణం- రిగ్గింగ్. ఎన్నికల పార్టీలన్నీ ఆ ఒక్క రోజు ఓట్లు వేయించుకోవడంమీద కేంద్రీకరించినట్లుగా ప్రచారంమీదకూడా మనసు పెట్టలేదనడానికి అసెంబ్లీ ఎన్నికలు మరింత స్పష్టమైన దాఖలా. ఆంధ్రప్రదేశ్‌లో నయితే ఆఖరిరోజుదాకా ఎప్పుడూ పత్రికలు సెన్సేషనల్‌గా వర్ణించే ఎన్నికల వేడి పుట్టలేదు. హైదరాబాదు నగరంలో తెలుగుదేశం పార్టీకి బిజెపి, ప్రతిపక్షాలకు మజ్లిస్ 'ప్రజాస్వామిక' ఎన్నికలంటే ఎట్లా వుండాలో మలక్‌పేటలో, చాంద్రాయణగుట్టలో ఒక రిహార్సల్ చేసి చూపాయి.

అయితే మరి ఇది "దొంగ నోట్ల, దొంగ ఓట్ల రాజ్యమేనా" అంటే అది మాత్రమే పూర్తి నిజం కాదు. దేశం ఛిన్నాభిన్నమై పోతున్నది, దేశ సమగ్రత ప్రమాదంలో వున్నది- కనుక దేశ సమైక్యతను కాపాడాలంటే కాంగ్రెస్ ఐ నాయకత్వాన్ని బలపరచాలనే ఒక బాధ్యత ప్రాథమిక ఓటరు స్వీకరించే స్థితిని రాజీవ్ గాంధీ కల్పించగలిగాడు. తిండి. బట్ట వంటి ప్రాథమిక అవసరాలు తీర్చి అవినీతి, లంచగొండితనం లేని ప్రభుత్వాన్ని తెలుగుదేశం పార్టీ మాత్రమే ఏర్పాటు చేయగలదనే భరోసాను ఎన్టీఆర్ కలిగించగలిగాడు. ఈ రెండు భ్రమలూ పరస్పర భిన్నమైనవి కావు. పైకి విరుద్ధంగా కనిపిస్తున్న పార్లమెంటుకు అతీతంగా ప్రజాస్వామ్యం గురించి మౌలికంగా ఆలోచిస్తున్న ప్రజల ఆచరణకు రెండు వైపులా కళ్ళకు దడి గట్టడానికి పాలక వర్గాలు సృష్టించిన తాత్కాలిక ప్రచార దాడులే. అయితే ఈ అవకాశం మాత్రం పార్లమెంటరీ 'ప్రతిపక్షాలు' అటు కాంగ్రెస్‌కు, 'మిత్ర పక్షాలు' ఇటు తెలుగుదేశం పార్టీకి ఇచ్చి కూర్చున్నవి.

అందుకే 'ప్రజాస్వామ్య' ప్రభుత్వాల స్థాపనకొరకు జరిగే ఎన్నికల్లో అన్నిటికన్నా మించి అదృశ్యమైపోయింది ఏమిటంటే ప్రజాస్వామ్యమే. కేంద్రంలోని సామ్రాజ్యవాద దళారీ నిరంకుశత్వాన్ని ప్రశ్నించి ఎదిరించినందుకు అస్సాంలోనూ పంజాబ్‌లోనూ ఎన్నికలు లేవు. ఈశాన్య రాష్ట్రాల్లో ఎన్నికలు జరిగినా, జరగకున్నా సాగేది మిలటరీ పాలనే. పంజాబ్ స్వర్ణ దేవాలయంమీద దాడి, పంజాబ్ నంతా కల్లోలిత ప్రాంతంగా ప్రకటించడం, పంజాబ్‌ను సాకుచేసుకొని, పంజాబ్‌ను కూడా కాదు, పంజాబ్‌లో 'టెర్రరిస్టు' ప్రమాదాన్ని సాకుచేసుకొని దేశానికంతా వర్తించే టెర్రరిస్టు అఫెక్టెడ్ ఏరియా చట్టాన్ని తేవడం- ఇవన్నీ 'ప్రజాస్వామ్య' ఎన్నికల్లో ప్రచార అంశాలు।

వింధ్యకు ఉత్తరాన వున్న రాష్ట్రాలన్నిటా పంజాబ్ గురించి పదే పదే అబద్ధాలు చెప్పి ప్రజల్లో భయోత్పాతాలు సృష్టించి అసెంబ్లీ ఎన్నికలు కూడా గెలుచుకున్నాడు రాజీవ్‌గాంధీ. మతోన్మాద రాజకీయాలతోనే బిజెపి కూడా తాలూ పరక ఏరుకున్నది,

కేంద్రం కోపం మహాప్రసాదంగా ఎన్నికలు గెలుచుకున్నవి సిక్కిం, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్‌లోని కాంగ్రెసేతర పార్టీలు.

అయితే ఈ ఎన్నికలు ఏవైనా మౌలిక సమస్యలను చర్చకు తెచ్చాయా ఏ పార్టీ అయినా ఒక ఆర్థిక, సామాజిక, రాజకీయ భవిష్యత్ కార్యక్రమాన్ని ప్రకటించిందా? ఎంత దివాళాకోరు ఆర్థిక వ్యవస్థలో ఎంత అర్థరహితమైన 'దేశ సమగ్రత' ప్రమాదాన్ని హెచ్చరించి రాజీవ్ ఎన్నికలు గెలుచుకున్నాడో చూపడానికి కేంద్ర బడ్జెట్ ఒక్కటి చాలు నిదర్శనం.

ఎన్నికలపార్టీలకు ప్రజలుఎదుర్కొంటున్న నిజమైనసమస్యలేవో, ప్రజలనుంచి తాము ఎదుర్కొంటున్న నిజమైనసవాళ్ళు ఏవో తెలియపనికాదు. ఆసవాళ్ళనుంచి ప్రజల్ని కొన్నాళ్ళపాటు మభ్యపుచ్చడానికి ఎన్నికలు. ఆచైతన్యంనుంచి ప్రజల్ని గాడితప్పించడానికి ఎన్నికలు. ఎన్నికల సందర్భంగా జరిగిన విశ్లేషణలన్నీ మొత్తంగా ఎన్నికల పట్ల ఓటరుకు అనాసక్తి పెరిగిందన్న అంశాన్ని ఎత్తిచూపుతున్నాయి. నూతన ప్రజాస్వామిక విప్లవ చైతన్యంలో భాగంగా కొన్ని చోట్ల, తమ డిమాండులు నెరవేరలేదనే కినుకతో ఎన్నోచోట్ల ప్రజలు ఎన్నికలు బహిష్కరించారు. లోక్‌సభ ఎన్నికలతో పోల్చినా అసెంబ్లీ ఎన్నికలు మందకొడిగా సాగాయి. ఎన్నికల గురించి ఎంతో ఆసక్తితో రేడియో టెలివిజన్‌లకు చెవులు, కళ్ళు అప్పగించినవాళ్ళు మనసుకూడా పెట్టి ఉంటే మధ్యాహ్నం వార్తల వరకు ఇరవై, ఇరవైఏదు శాతం కూడా పోల్‌కాని ఓట్లు సాయంకాలానికి 55-65 శాతానికి ఎట్లా చేరుకున్నాయో మలక్‌పేటలో రాష్ట్రంలోకల్లా అత్యధిక పోలింగ్, చాంద్రాయణగుట్టలో కొన్ని బూతులలో నూరు శాతం మించిన పోలింగ్‌లతో పోల్చుకొని తేల్చుకోవచ్చు. పోలింగ్ అంటే రిగ్గింగు. పోలింగ్ బూత్ అంటే బూతే!

ఈసారి అందుకే ఎన్నికల పార్టీలు మాత్రమే కాదు ప్రభుత్వాలు ఓట్లు ఎక్కువ సంఖ్యలోపడడం మీద తమ బలాన్ని కేంద్రీకరించాయి. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఎన్నికల నిర్వహణ కోసం తనకున్న పోలీసు బలగాలకాక ముప్పై

వేల మంది పదవీ విరమణ చేసిన సైనికులను పోలీసులను ఎంతో ఆకర్షణీయమైన ప్రతిఫలమిచ్చి నియోగించింది. ఎన్నికల బహిష్కరణ క్యాంపెయిన్ జరిగిన జగిత్యాల, మెట్‌పల్లి, భీంగల్ వంటి పోరాట ప్రాంతాల్లో అదనపు బలాలను దించింది. భీంగల్ ప్రాంతంలోనయితే ఏ ఊరికీ ఏ ఎన్నికల పార్టీ రాలేదు గానీ, ఎన్నికల ముందు నుంచి అయిపోయేదాకా ప్రజలు ఓట్లు వేసేలా చూడడం కోసమే పోలీసు బలగాలొచ్చాయి.

ఎన్నికల్లో ఓట్లువేయాలనే ప్రచారమేగానీ ఓట్లు వేయవద్దనే ప్రచారం చేయడం నేరమవుతుందా? బలవంతంగా ఓట్లు వేయించడం నేరంకాదు గానీ, స్వచ్ఛందంగా ఎన్నికలు బహిష్కరించడం నేరమవుతుందా? వరంగల్ నగరం వడ్డెపల్లిలో పోలీసు అధికారులు ఓటర్ల జాబితాపట్టుకొని ఓటువేయనివాడు రాడికల్ కింద లెక్కగనుక రాడికల్ ఎవరో తెలుసుకునే కొత్తపద్ధతి కనుకున్నారు. ఉత్తర భారతదేశంలో హిందూమతోన్మాదులకు టర్బన్‌తో కనిపించినవాడు నేరస్తుడయినట్లు ఉత్తరతెలంగాణ జిల్లాల్లో ఓటు వేయనివాడు రాడికల్ అయ్యాడు - నేరస్తుడయ్యాడు. 'కరీంనగర్ జిల్లా తీవ్రవాదుల ప్రాబల్యం వున్న ప్రాంతంలో ఓట్లు నిర్భయంగా వేయడానికి' అన్నిఏర్పాట్లూ సాయుధంగా చేసామని జిల్లా ఎస్పీ ప్రకటించాడు. ఉత్తరతెలంగాణ జిల్లాల్లో అడవి ప్రాంతంతో సహా ఏర్పాటు చేసిన కేంద్ర రిజర్వు పోలీసుక్యాంపులను తాత్కాలికంగా ఎన్నికల పనులకు తరలించారు.

తుపాకులు చదువు చెప్తాయి. తుపాకులు బొగ్గుగనుల్లో పని చేస్తాయి. తుపాకులు ఓట్లు వేయిస్తాయి. దౌర్జన్యంతో 'ప్రజాస్వామ్యాన్ని' స్థాపించుకునే స్థితికి మన పాలక వర్గ సంస్కృతి ఎదిగింది.

ఆనాడు అస్సాం నుంచి ఇవ్వాళ భీంగల్‌దాకా 'ప్రజాస్వామ్యన్ని' కాపాడుకోవడం కోసం పాలక వర్గాలు తుపాకులకు చాల పని చెప్పాల్సి వస్తున్నది. ఎందుకంటే ప్రజల ప్రజాస్వామ్యాన్ని పోరాడి సాధించడం కోసం ఎన్నికలను బహిష్కరించిన విప్లవ పార్టీలు తుపాకి గొట్టంద్వారానే రాజ్యాధికారం వస్తుందన్న నిజమైన ప్రత్యామ్నాయ రాజకీయాలను ప్రజల చైతన్యంలో నాగేటి చాళ్ళలో నెత్తుటి విత్తనాలు చల్లి చిగురింప చేస్తున్నది.

3-4-'85

కవిత :

## ఆబిడ్స్, ఫిబ్రవరి 3

'ప్రివావి'

ఎన్నెన్ని దమనకాండల్ని
చూపించీ ఆబిడ్స్!
ఎన్నెన్ని పోరాట శిఖరారోహణల్ని
చూసిందీ ఆబిడ్స్!
ఎన్ని తరాలుగా
దారి తోచని నెత్తురెంత
ఈ సర్కిల్‌లో దుర్మార్గపు లాఠీల కంటిందో!
భూమిని చీల్చుకుని విస్తరించిన
ఊడల మర్రి కసాయి నీడకు
భూస్వామ్య దౌర్జన్యం చీకటిని
వెలిగింప జేసిన
రైతాంగ యోధుల నెత్తురుకు
విలీనమనే మారణహోమానికి
విరమణ పేరిటి పాదాభివందనానికి
సుషుప్తిని జడిపింపజేసిన
విద్యుదాఘాతానికి
తెలంగాణా గడ్డమీద మళ్ళీపూచి
దేశాన్ని పరిమళింపజేస్తున్న
ఎర్రెర్రని మోదుగు పూలకు
ఎన్ని దురంతాలకు
మరెన్ని ప్రతిఘటనలకు
ఎన్ని గాయాలకు
మరెన్ని రక్తసిక్త సూర్యోదయాలకు
మౌన సాక్షి ఈ ఆబిడ్స్!

ఈ కూడలిలోనే
లాఠీ విసరిన ఆ సాయంత్రానికి
వినాదాన్ని వీచిన
ఆ రాత్రి జవాబు చెప్పింది
సిమెంట్ పిడికిట్లో చిక్కకొని చచ్చిన
స్వేచ్ఛా విహంగాన్ని
విసురుతున్న
'శాంతి దూత'ను విగ్రహం చేసి
ఈ చౌరస్తాలోనే
దారి తెలిసిన బాటసారుల
కదుములు కట్టిన దేహాలు
ఆరాత్రి
హైదరాబాద్ ఆకాశంమీద
ఉద్వేగభరిత నక్షత్రాలయి ప్రజ్వరిల్లాయి

ఒక్క క్షణం లోయలో
వాళ్ళు కనుమరుగయిన మాట నిజమే
కాని చూడు-
మరు క్షణం వాళ్ళు
శిఖరం శిరసున ఎగరిన ఎర్రజెండా అయ్యారు
కటకటాల వెనుక
మూసేయబడ్డ సగంఆకాశాన్ని తలచుకుని
కళ్ల చెమర్చిన మాట నిజమే
వ్యథాందోళన మానవీయమే
కాని చూడు
నలుపెక్కిన ఆకాశం
నగర వీధుల్లో
సంధ్యారాగమయి
ప్రవహించింది

అలవాటయిన కొలమానాల
లాలిత్యపు శరీరాలు
రక్తమోడిన మాట నిజమే
కాని చూడు
కాగితపు పులి
కంట్రోల్ రూమ్‌లో గాయాలు నాక్కుంటోంది
భాగస్వామ్యం
సిద్ధాంతంలోనే కాదు
నిర్మాణంలోనే కాదు
పోరాటంలో వస్తుందని
చావు బతుకుల కత్తి అంచుమీదనే
మన ఆదర్శాల పరీక్ష అని
నా చెల్లెళ్ళు నిరూపిస్తున్నవేళ
అది చైతన్య కెరటాల వేల

లోకాన్ని ముంచెత్తబోయే ఉప్పెన
మనింట్లో మొదలయ్యే వేళ
ఆ ఉప్పెనలో మనమూ
భాగమనుకుంటున్న వేళ
సుడుగయి విరిగిపోయే అలలో
కనబడేది
వెల్లువయ్యే ప్రళయతరంగమే-
అది
ఆశకు సంకేతం

ఆబిడ్స్
ఆ సాయంత్రపు దౌర్జన్యానికి కాదు
ఆ రాత్రి వికసించిన
ఉత్తేజానికి సంకేతం
ఇవాల్టి దుర్మార్గానికి కాదు
రేపటి విజయోత్సవానికి కేతనం

బెంగాలీ కవిత :

# మృత్యులోయ నా మాతృభూమి కాదు

నబరుణ్ భట్టాచార్య

తన కొడుకు శవాన్ని
గుర్తించడానికి భయపడే ఆ తండ్రిని
నేను ద్వేషిస్తాను
ఇంకా నిస్సిగ్గుగా సజావుగానే ఉండే
ఆ తోబుట్టువును
నేను ద్వేషిస్తాను
పట్టపగలు జరిగిన ఈ హత్యకు
ప్రతీకారం తీర్చుకోదలచని
ఆ మేధావినీ
ఆ కవినీ
ఆ గుమాస్తానూ
నేను ద్వేషిస్తాను
నా చైతన్య పథానికడ్డం తగులుతూ
ఎనిమిది మానవ మృత దేహాలక్కడ
పడి ఉన్నాయి
నేనింకమామూలుగా ఉండలేకపోతున్నాను
తెరచుకున్న ఎనిమిది జతల కళ్ళు
నన్ను నిద్రలో వెంటాడుతున్నయి
నేను ఉలికిపడి వెర్రికేకలు వేసినాను
ఎల్లవేళలా వాళ్లు నన్ను
వేళకాని వేళల్లో
తోటలోకి రమ్మని పిలుస్తారు
నాకు పిచ్చెక్కుతుంది
ఆత్మహత్యకు తలపడతాను
నాకు తోచిన పని చేస్తాను

[illegible] కాదు

కవిత్వం రాయవలసిన సమయమిదే

కరపత్రాల మీద
గోడలమీద
బండబ్బులో
ఎవరికి వాళ్ల వాళ్ళ నెత్తురుతో
కన్నీళ్ళతో
ఎముకలతో
నగ్న చిత్రాల మీద
కవిత్వం రాయవలసిన సమయమిది

చెదరిన ముఖాల మీది
తీవ్రమైన వేదనలతో
కవిత్వాన్ని కూర్చడం
ఇప్పుడు వీలవుతుంది
పోలీసు వాహనాలు కుమ్మరించే హెడ్‌లైట్ల వేపు
భయంతో చూసే ముఖాల మీద
నిలిచిపోయిన కళ్ళతో
కవిత్వాలు చిత్రీకరించవచ్చు
హంతకుల దగ్గరిపాయింట్ త్రీఎయిట్ రివాల్వర్లనూ
ఇతర మారణాయుధాలనూ ధిక్కరిస్తూ
సరిగ్గా ఇప్పుడే కవిత్వం చదవవచ్చు

కవితా ధిక్కారం
మంచువంటి చల్లని లాకప్ గదుల్లో
శవాల కొట్లలో ప్రతిధ్వనించనీ
హంతకుల కనుసన్నల్లో నడిచే
న్యాయస్థానాల కుషన్ కుర్చీల జ్ఞానాన్ని
గడగడలాడిస్తూ

కవితా ధిక్కారం మార్మోగనీ
ప్రమాదకర అసత్య విద్యాలయాల్లో
భయం దోపిడీల రాజ్యాంగయంత్రంలో
సైనిక పౌర అధికారుల గుండెల మీద
కవితా ధిక్కారం ప్రతిధ్వనించనీ

బెంగాల్ కవులు లోర్కా[1]లాగ
చంపబడడానికీ
గొంతు నులుమబడడానికీ
ఎత్తుకు పోబడడానికీ
స్టెన్‌గన్ తుపాకులతో
ఒళ్ళు తూట్లు పొడిపించుకోవడానికీ
సిద్ధపడనీ....

అర్జంటుగా ఇప్పుడు
నగర కవిత్వ ప్రాంతాన్ని
ప్రజా గీతాల పల్లెసీమలు
చుట్టుముట్టాలి

ఈ మృత్యులోయ నా మాతృభూమి కాదు
ఈ తలారుల వేడుకల వేదిక
నా మాతృభూమి కాదు
ఈ విశాల శ్మశానం
నా మాతృభూమి కాదు
రక్తంలో తడిసిన ఈ వధ్యశాల
నా మాతృభూమి కాదు
నా మాతృభూమిని
నేను మళ్ళీ లాక్కుంటాను

1. స్పెయిన్ అంతర్యుద్ధంలో (1936) పాల్గొని అమరుడైన గ్రీసుదేశపు కవి.

నా గుండె లోలోతుల్లోకి
ఆదుముకుంటాను
పైరబట్టిన పూలగుత్తుల సారాన్ని
పగటిపూట పీలుస్తాను
చుట్టూరా మిలమిలలాడే
మిణుగురుపురుగుల్ని కాపలించుకుంటాను
ఓహ్.
అక్కడ కొండల మీద
చదును చేసిన పొలాలున్నాయి
అసంఖ్యాక హృదయాల పంటలున్నాయి
జానపద గాథలున్నాయి
పువ్వులున్నాయి
స్త్రీలున్నారు
సెలయేళ్ళున్నాయి
అక్కడ ప్రతి ఒక్క ప్రత్యేక నక్షత్రం మీద
నేను ప్రతి ఒక్క అమర వీరుడి
పేరు ఇష్టంగా చెక్కుతాను
నేనక్కడ
కల్లోలిత గాలి తెరల్ని
సూర్యకాంతికి మెరిసే చేప కళ్ళలాంటి
నిర్మలమైన సరస్సుల్ని ఆజ్ఞాపిస్తాను
పుట్టిన మరుక్షణాన్నే
ఏ ప్రేమనుంచి అస్పృశ్యులుగా
మనం వేల కాంతిసంవత్సరాల దూరం కొట్టబడ్డామో
ఆ ప్రేమను ఆవాహన చేస్తాను
మన విప్లవ విజయోత్సవ దినాన
మనం ప్రేమను కూడ ఆహ్వానిస్తాం

వెయ్యి వాట్ల విద్యుత్కాంతిని
కళ్ళమీదికి గురిపెట్టి
దినాలూ రాత్రిలూ రోజుల తరబడి
జరిగే ఇంటరాగేషన్‌ను
మనం ధిక్కరిస్తాం
గోళ్ళలోకి సూదులు గుచ్చడాన్ని
మనం ధిక్కరిస్తాం
మంచుగడ్డల మీద బలవంతంగా
పడుకోబెట్టడాన్ని మనం ధిక్కరిస్తాం
ముక్కుల్లోంచి రక్తం స్రవించేదాకా
మనసు తలకిందులుగా వేలాడదీయడాన్ని
మనం ధిక్కరిస్తాం
మన పెదాలమీద
ఉక్కు పాదాలతో తొక్కడాన్ని
కణకణమండే ఇనుప ఊచలతో
మన శరీరంమీద గాట్లు పెట్టడాన్ని
మన నగ్నదేహాలమీద ఎలక్ట్రిక్ షాక్‌లను
మనసు దిగంబరుల్ని చేసి
అసహ్యకరమైన లైంగిక చర్యలతో
వాళ్ళు పొందే పైశాచికానందాన్ని
మనం ధిక్కరిస్తాం
చచ్చేదాకా కొట్టడాన్ని
పుర్రెను రివాల్వర్‌తో ముద్దుపెట్టుకుని
కాల్చేయడాన్ని
మనం ధిక్కరిస్తాం

కవిత్వం ఏ అడ్డంకినీ అంగీకరించదు
కవిత్వం సాయుధం

కవిత్వం స్వేచ్ఛామయం
కవిత్వం భయరహితం

మయకోవస్కీ[2], హిక్మత్[3], నెరూడా[4]
అరగాన్[5], ఎలార్డ్[6] - చూడండి
మీ కవిత్వ సహజ స్ఫూర్తిని
మేం కుంగిపోనివ్వలేదు

పైగా మా దేశమంతటా
ఒక కొత్త ఇతిహాసం రాసే
ప్రయత్నం ప్రారంభమైంది
సకల కవితా క్షేత్రం
గెరిల్లా లయతో తొణికిసలాడుతున్నది

---

2. రష్యన్ కవి. లెనిన్‌పై ఈ కవి రాసిన కావ్యాన్ని శ్రీశ్రీ అనువదించారు.

3. టర్కీ దేశపు విప్లవ కవి నజీం హిక్మత్

4. పాబ్లో నెరూడా. చిలీ కవి. అలెండీ ప్రభుత్వాన్ని అమెరికా కుట్రతో కూలదోసినపుడు ఇంట్లో హత్య చేయబడ్డాడు. స్పెయిన్ అంతర్యుద్ధంలో పాల్గొన్న కవి. సాహిత్యానికి నోబెల్ బహుమతి పొందాడు.

5. లూయీ అరగాన్- ఫ్రెంచ్ కవి. ప్యారిస్ నగరాన్ని జర్మన్ నాజీ సేనలు చుట్టిముట్టినపుడు కవులు, కళాకారులు చాలమంది పారిపోగా నిలిచి పోరిన కవి. అందుకే కాళోజీని శ్రీ శ్రీ అరగాన్‌తో పోల్చాడు. కవిత్వంలో అధివాస్తవిక ధోరణికి కూడా ఆద్యులతో ఒకడు.

6. పాల్ ఎలార్డ్ (1985-1952) ఫ్రెంచికవి సంజ్ఞావాద (సింబాలిజం) కవిగా ప్రారంభించి సర్రియలిస్టు (అధివాస్తవిక) కవిగా పరిణమించాడు. కమ్యూనిష్టు ఉద్యమంలో కూడ కలిసాడు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జర్మన్ ఆక్రమణకు వ్యతిరేకంగా రహస్య ప్రతిఘటనోద్యమంలో పాల్గొన్నాడు. శ్రీశ్రీ 'ఖడ్గ సృష్టి' కవితా సంకలనంలో ఎనిమిది కవితలకు మూలం ఎలార్డ్. వానిలోంచి 'స్వాతంత్ర్యం' అనే కవిత సృజన ఆగస్టు 83 సంచిక ప్రచురించింది.

తప్పెట్ల సంరంభం
ప్రచండంగా రేగనీ
గిరిజన గ్రామాలు పగడపు దీవుల్లాగ తళతళ్లనీ
నీలిరంగు పొలాలు
నెత్తుట్లో తడిసి ఎరుపెక్కనీ

నోటినిండా తాచుపాము విషపు నురగలు కక్కుతూ
టైటస్[7] క్షతగాత్రుడయ్యాడు

విషభరితమైన మారణ శీతల దాహంలో
విషముష్టి[8] గింజలున్నాయి

సంధించిన బాణంతో
సూర్యుణ్ణి కప్పేసే
వింటి నారి ధ్వని
పదును పెట్టిన బాణపు కొసల
తీక్షణమైన వాదరలు
ఈటెలూ యుద్ధాల పరశువులూ
మనతోనే ఉన్నాయి
మెరిసే బల్లాలు
గుంపుల్ని బంధించే గాలాలు
డప్పుల లయకు నాట్యం చేసే
నెత్తురు తాగే ఆటవిక వంశ చిహ్నాలు
తుపాకులూ పారలూ కొడవళ్లూ
గుండెలనిండా ధైర్యమూ
మనకే ఉన్నాయి
సమస్త భయమూ శూన్యంలోకి అస్తమించేంత .

7. టైటస్– గ్రీకు పురాణ గాథల్లో పాత్ర సర్వనామం కూడా కావచ్చు.
8. *Nux Vomica* బెంగాల్‌లో దొరికే ఒక రకమైన విషముష్టి కాయలు.

సమృద్ధిగా ఉన్నాయి
అంతేకాదు
బరువులెత్తే క్రేన్‌లున్నాయి
భారీ పళ్ళ బుల్‌డోజర్లున్నాయి
రాపాడుతున్న డైనమోలు టర్బైన్లు
లోహం కోసే పరికరాలు యంత్రాలు
అనంత ప్రవాహంగా ఊరేగుతున్నాయి
శగిలో అంధకారంలో
కూలిపోతున్న
కరడుగట్టిన బొగ్గుశిలల్లో
కఠిన వజ్రాలవంటి కళ్లు
ఓడరేవుల్లో, జౌళిమిల్లుల్లో, కొలుముల్లో
శ్రమిస్తున్న వేలాది హస్తాలు
ఆకాశానికి ఎత్తిపట్టిన
అద్భుతమైన ఉక్కు సుత్తెలు
లేదు, నేను భయపడడం లేదు
భయంతో పాలిపోయిన ముఖం
అపరిచితమైనదిగా తోస్తుంది
మరణమంటే ప్రేమ తప్ప
మరొకటి కాదని నాకు తెలుసు గనుక
నేను చంపబడితే
బెంగాల్‌లోని అన్ని మట్టి ప్రమిదల
నన్ను నేను అగ్నిజ్వాలలుగా చూసుకుంటాను
నాకు నాశనం లేదు
ఋతువు తర్వాత ఋతువు
పచ్చని ఆశ రూపంలో
నేను భూమిలోంచి మొలకెత్తుతాను
నాకు అంతంలేదు

కష్టాల్లో కడగండ్లలో
శిశు జననం దగ్గర
అంత్యక్రియల దగ్గర
నేను నిలిచే ఉంటాను
బెంగాల్ మిగిలి ఉన్నంతవరకూ
మనుషులు బతికి ఉన్నంత వరకూ
నేను నిలిచే ఉంటాను
రాత్రివేళ చల్లదనంలో
మృత్యువు మండిపోయి
గాలిలో ఆవిరయిపోతుంది
అరోణను ఆవాహన చెయ్
ఆ యుద్ధాన్ని
ఆ మరణాన్ని ఆవాహన చెయ్
తెడ్లతో నడిచే చిన్న స్వదేశీ పడవలే
సప్తమ నౌకాదళాన్ని[9] అడ్డగించనీ
కొమ్ముబూరలూ శంఖాలూ మాత్రమే ఊది
యుద్ధం ప్రకటించబడనీ
గాలి గాలంతా రక్త పరిమళంతో
ప్రభంజనంగా ఉన్నవేళ
కవిత్వం జ్వాలల్లో రేగనీ
నేలమన్ను తుపాకీ మందు లాగ
పేలడానికి సిద్ధంగా ఉంది
అంతమైన పల్లెసీమలూ
పడవలూ నగరాలూ గుళ్ళూ
జ్వలించడానికి సిద్ధంగా ఉన్నాయి
మైదానాలకూ సుందర్బన్స్[10]కూ మధ్య
విశాలమైన భూమి

---

9. బంగ్లాదేశ్ యుద్ధ సమయంలో అమెరికా తన సప్తమ నౌకాదళాన్ని ఇండియా వైపు కదిలించి బెదరించింది.

10. బెంగాల్‌లో 24 పరగణాల జిల్లాలో భాగంగా వున్న ద్వీపారణ్య ప్రాంతం. బంగ్లాదేశ్‌కు సరిహద్దు. ఇప్పటికీ విప్లవోద్యమం వున్న ప్రాంతం.

ఒక రాత్రింతా కన్నీళ్లు కార్చిన తర్వాత
దందహ్యమానంగా ఉంది గనుక
నా మాతృభూమి నేలకూ
వధ్యశాల నేలమీది రొచ్చుకూ
తేడా నశించిపోయింది గనుక
ఇంక సంకోచం అక్కరలేదు
భయం లేదు
సందేహం లేదు
సూర్యగ్రహణపు నిశీథిలో
ఎనిమిది మంది నన్ను స్పృశిస్తున్నారు
మనను మనం ఎక్కడ కాపాడుకోవాలో
వాళ్ళు ఆదేశిస్తున్నారు
నక్షత్ర మండలాల కాంతుల్ని
పాలపుంతల నీడల్ని
సముద్రాల ఛాయల్ని
విశ్వంలో ఓ మూలనుంచి మరో మూలకు
ప్రయాణించే వారసత్వ హక్కునూ
వాళ్ళ గొంతులు
ప్రతిఫలిస్తున్నవేళ
కవిత్వపు మందే కాగడాలు
మూల్టప్ కాక్‌టెయిల్‌లు
టాల్విన్ మంటలు
ఈ ప్రగాఢ వాంఛతో దిగిరానీ

[నక్సల్బరీ ఉద్యమం మొదలయ్యాక బెంగాల్‌లో, ముఖ్యంగా కలకత్తా నగరంలో 1970-71 ప్రాంతాల్లో పోలీసులు సాగించిన సామూహిక హత్యకాండకు అదే కాలంలో రచింపబడిన ఈ కవిత సజీవ దృశ్యం. ఇందులో ప్రస్తావించబడిన ఎనిమిది హత్యలు బారసాత్‌లో 1970 నవంబర్ 18న ఎనిమిది మంది విప్లవకారులను పోలీసులు పట్టుకొని కాల్చేసిన సంఘటన. 1983 సెప్టెంబర్‌లో, అఖిల భారత విప్లవ సాంస్కృతికసమితి ప్రథమ మహాసభలసందర్భంగా (అక్టోబర్ 81, న్యూఢిల్లీ) వెలువడిన (Flaming Seventies) అనే బెంగాలీ కవితల ఇంగ్లీషు అనువాద సంకలనంలో కవి నబరుణ్ భట్టాచార్య గురించి ఏ వివరాలూ లేవు. ఈనాడు ఉత్తర తెలంగాణ జిల్లాల్లో, వరంగల్ పట్టణంలోవున్న నిర్బంధానికీఉద్యమంపట్ల కమిట్‌మెంట్‌కు కూడా ఈ కవిత వర్తిస్తుంది. — సా.మి.]

# తొబా తేక్‌సింగ్ ఎక్కడుంది?

సాదత్ హసన్ మాంటో

(స్వాతంత్ర్యం పేరుతో జరిగిన మారణకాండ హిందీ, బెంగాల్, పంజాబ్, ఉర్దూ భాషలలో మతోన్మాదానికి వ్యతిరేకంగా అద్భుతమైన సాహిత్యాన్ని సృష్టించింది. ఆ కాలపు అభ్యుదయ రచయితలందరూ (అభ్యుదయ రచయితలు ఆ కాలంలో) స్వాతంత్ర్యపు ఉదయాన్ని ఉదయంగా గుర్తించ నిరాకరించారు. ఐదు లక్షల మంది ఊచకోతకు, 60 లక్షల మంది ప్రజల వలసకు కారణమయి వాళ్ళని నిర్దేశించి నడిపించిన ఉన్మాదానికి, రాజకీయ కుట్రకు వ్యతిరేకంగా కవిత్వంలోనూ, కథలోనూ నవలలోనూ ప్రతిస్పందించారు. ఆ సాహిత్యంలో భాగమే ఇక్కడ ప్రచురిస్తున్న మాంటో కథ

సాదత్ హసన్ మాంటో ఉర్దూ కథా సాహిత్య చక్రవర్తి. పేద కుటుంబం నుంచి వచ్చి అతి కష్టంమీద అమృత్‌సర్‌లో మెట్రిక్ పూర్తి చేసుకున్న మాంటో పెద్ద చదువులు చదువుకోలేదు. అలీఘడ్ ముస్లిం విశ్వవిద్యాలయం కళాశాలలో ఇంటర్‌లో చేరి వీధినపడ్డాడు. ఢిల్లీ చేరుకుని బతుకుదెరువుకోసం ఒకపత్రికలో చేరాడు. అక్కడే చెకోవ్, హ్యూగో, గోర్కీ, మొపాసా మొదలయిన రచయితల్ని అనువదిస్తు తన సాహిత్య జీవితాన్ని ప్రారంభించాడు. త్వరలోనే తాను స్వయంగా కథలు రాయడం మొదలెట్టాడు ఢిల్లీ, బొంబాయి, అమృత్‌సర్ నగరాల మధ్య ఉద్యోగాలు మారుస్తు కథలు రాస్తూ ఉర్దూ సాహిత్యంలో తనదంటు ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరుచు కున్నాడు. మూడు భాషలలో కథా సాహిత్యాన్నే కాక, కవిత్వాన్నికూడా ప్రభావితం చేయగలిగాడు. సుమారు 300 కథల్ని, 100 నాటికల్ని రాసాడు. ఇవికాక "సామ మామకు ఉత్తరాలు" అనే పేరుతో వచ్చిన సంకలనం అమెరికన్ సామ్రాజ్య వాదం పై వచ్చిన రచనలలో చెప్పుకోతగ్గదిగా పేరు పొందింది దేశ విభజన తర్వాత లాహోర్‌లో స్థిరపడి అక్కడ 1955లో తన 44వ ఏట మరణించాడు. మతోన్మాదా నికి వ్యతిరేకంగా "చీకటి సరిహద్దులు" అనే పేరుతో వచ్చిన చిన్న చిన్న సంఘటనల సంకలనం మతకల్లోలాలలో జీవన్మరణ సంఘర్షణకు బలమయినప్రతిబింబం. ఈ సంకలనం కాక, బాగా ప్రాచుర్యం పొందింది. పిచ్చివాళ్ళని వివేకవంతులుగా, వివేక వంతుల్ని పిచ్చివాళ్ళుగా చిత్రికరించే ఈ కథ — "తొబాతేక్‌సింగ్ ఎక్కడుంది?"

— సాహితీమిత్రులు)

భారత ఉపఖండం రెండుగా చీలిపోయిన కొన్నాళ్ళకు భారత, పాకిస్తాన్ ప్రభుత్వాలు ఒక నిర్ణయానికి వచ్చాయి. సాధారణ నేరస్తులతోపాటు, పిచ్చాసుపత్రుల్లో ఉంటున్న పిచ్చివాళ్ళను కూడా తమ తమ దేశాలకు తరలించాలనుకున్నాయి. అంటే పాకిస్తాన్‌లో చిక్కుకుపోయిన హిందూ, సిక్కు పిచ్చివాళ్ళను ఇండియాకు, ఇండియాలో ఉండిపోయిన ముస్లిం పిచ్చివాళ్ళను పాకిస్తాన్‌కు తరలిస్తారు.

ఇలా చేయడం సబబా కాదా? అన్న ప్రశ్న వచ్చింది. శిఖరాగ్ర సభలూ సమావేశాలు జరిగాయి. ఇరుదేశాల పెద్ద పెద్ద ఆఫీసర్ల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు, సుదీర్ఘ చర్చలు జరిగిన అనంతరం సబబే అని తీర్మానమయింది. సదరు కార్యక్రమానికి ఓ పథకం కూడా సిద్ధమయింది. ఒకవేళ ఇండియాలో ఉన్న ముస్లిం పిచ్చివాళ్ళకు ఇక్కడే బంధువులూ, ఇతర లావాదేవీలు ఉంటే వాళ్ళను తప్ప మిగతా వాళ్ళను పాకిస్తాన్ పంపుతారు. పాకిస్తాన్‌లో ఉన్న హిందూ, సిక్కు పిచ్చివాళ్లయినా అంతే. అంచేత పాకిస్తాన్ తన బాధ్యతమీద పోలీసు కస్టడీలో సురక్షితంగా హిందూ సిక్కు పిచ్చివాళ్ళను సరిహద్దు దాటించాలి.

ఇండియాలో ఈ పని ఎంతవరకు వచ్చిందో తెలీదు కాని ఈ వార్త లాహోర్ పిచ్చాసుపత్రికి చేరేసరికి అక్కడ పరిస్థితి చాలా ఆసక్తికరంగా తయారైంది. మతావేశాలు కూడా పెల్లుబికాయి. ప్రతిరోజూ దినపత్రిక 'డైలీ జమీందార్' చదవడం అలవాటు తప్పని ఓ పిచ్చివాడు పక్కనున్న తన స్నేహితునితో— గురూగారూ, ఈ పాకిస్తాన్ అంటే ఏంటి?' అనడిగాడు. ఆ పక్కనున్నవాడు సీరియస్‌గా ఆలోచించి, 'భారతదేశంలో ఓ ప్రాంతం. అక్కడ రేజర్లు, బ్లేడ్లు తయారవుతాయి' అని జవాబిచ్చాడు. ఆ సమాధానం విని అడిగినవాడు సంతృప్తి పడ్డాడు. ఓ సిక్కు పిచ్చోడు పక్కనున్న మరో సిక్కుతో— 'సర్దార్జీ' మనల్ని ఎందుకు హిందుస్తాన్‌కు పంపుతున్నారు? కనీసం మనకు ఆ దేశం భాషకూడా తెలీదే!' అన్నాడు.

ఆ సర్దార్జీ నవ్వి, 'నేనా భాషలో మాట్లాడగలను' అన్నాడు. ఇంకా తన పరిజ్ఞానం ప్రదర్శించడానికి ఊగిపోతూ ఓ పద్యం అందుకున్నాడు-

'హిందూస్థానీలందరూ సైతాన్లు
మురుగ్గుంటమీద దుంకుతూ
దర్పాన్ని వెలగబెడతారు.'

ఇంకా ఓ ముస్లిం పిచ్చోడు స్నానం చేస్తూ చేస్తూ 'పాకిస్తాన్ జిందాబాద్' అని నినాదమిచ్చాడు. ఆ నినాదం ఇచ్చిన ఆవేశం ఊపులో కాలుజారి కిందపడి స్పృహ తప్పాడు.

అక్కడ కొంతమంది 'పిచ్చోళ్ళు' అని సర్టిఫికెట్లు పొందిన వాళ్ళున్నారు. దాదాపు వాళ్ళంతా హత్యలు చేసిన బాపతు. పలుకుబడీ పైసా ఉన్న బంధువుల దయ వల్ల పైరవీలు చేసి అధికారులకు లంచాలిచ్చి ఆ ఆసుపత్రిలో చేరి ఉరితాళ్ళనుంచి తమ కంఠాల్ని కాపాడుకున్నారు. వాళ్ళలో కొంతమందికి ఈ విభజన ఎందుకు జరుగుతుందో అసలు పాకిస్తాన్ అంటే ఏమిటో సూచాయగా తెలుసు.

వార్తా పత్రికల ద్వారా వాళ్ళకు అందుతున్న సమాచారం చాలా అసమగ్రం. వాళ్ళ గార్డులు కూడా నిరక్షర కుక్షులే; అంచేత గార్డులుకూడా వాళ్ళకు తెలియజెప్పే పరిస్థితిలో లేరు. వాళ్ళలో వాళ్ళే మాట్లాడుకుని ఓ విషయాన్ని బైటికి తీశారు. అదేమంటే. స్వాతంత్ర్యానికి నాయకుడు 'ఖయద్ - ఏ ఆజమ్' అని పిలువబడే మహమ్మదాలి జిన్నా అనే వ్యక్తి ముస్లింల కోసం ఓ ప్రత్యేక రాజ్యాన్ని స్థాపించాడనీ. దాని పేరే పాకిస్తాన్—!

ఆదెక్కడుంది?
ఏ ప్రాంతంలో ఉంది?

ఈ సంగతులేం వాళ్లకు తెలీవు. పూర్తిగా పరిజ్ఞానం లేని విషయం మీద పిచ్చిగా ఆలోచించగల సత్తా ఉన్నవాళ్ళంతా ఆలోచిస్తూనే ఉన్నారు. ప్రస్తుతం వాళ్లుంటున్న ప్రదేశం పాకిస్తాన్‌లో ఉందో ఇండియాలో ఉంటో కూడా తెలీదు. ఒకవేళ ఇండియాలో వుంటే మరి పాకిస్తాన్ ఎక్కడుంది. ఒకవేళ పాకిస్తాన్‌లో ఉంటే ఇక్కడికెలా వచ్చారు? ఇది గతంలో ఇండియాలో భాగమా? ఈ జటిల సమస్య ఎటూ తేలక ఓ పిచ్చోడు మరీ పిచ్చోడైపోయి, ఓరోజు కసువు ఊడుస్తున్నవాడల్లా చెట్టెక్కి కూచున్నాడు. ఈ కీలకమైన అంశం మీద రెండు గంటల

పాటు ఆర్భాటంగా ఉపన్యసించాడు. గార్డ్స్ ఏమిటిదని అడిగితే. 'నేను ఇండియాలోనూ ఉండను, పాకిస్తాన్‌లోనూ ఉండను. ఈ చెట్టుమీదనే కాపురముంటాను' అని భీష్మించుకూర్చున్నాడు.

చివరికి. ఆవేశంనుంచి తేరుకున్నాక కండ్లల్ల నీరు కారంగ చెట్టు దిగాడు. తన హిందూ, సిక్కు మిత్రులనుంచి విడదీయబడతానేమోననే ఆలోచన అతన్ని భయకంపితున్ని చేసింది. వెంటనే పిచ్చిగా కావలించుకోవడం మొదలుపెట్టాడు.

ఓ రేడియో ఇంజనీరు, ముస్లింవాడు. సైన్సులో మాస్టర్ డిగ్రీ చదివాడు. ఎప్పుడూ ఒంటిగా ఉంటాడు. ఆసుపత్రి గార్డెన్ ఒంటరి మూలల్లో మౌనంగా పచార్లు చేస్తుంటాడు హఠాత్తుగా అతని నడకలో మార్పొచ్చింది. వెంటనే తన బట్టలన్నీ వదిలి చీఫ్ కానిస్టేబుల్‌కు అప్పగించి నగ్నంగా నడుస్తూ వెళ్లాడు.

ఓ లావుపాటి ముస్లిం పిచ్చోడు రోజుకు పదిహేను పదహారుసార్లు స్నానం చేస్తూ ఉంటాడు. పిచ్చాసుపత్రిలో చేరకముందు చినాయిట్‌లో ముస్లింలీగ్ కార్యకర్త. ఆయన పేరు మహమ్మదాలి. హఠాత్తుగా ముందుకు తోసుకొచ్చి- తనకుతాను 'ఖయద్-ఎ-ఆజం' మహమ్మదాలి జిన్నాగా ప్రకటించుకున్నాడు. దాంతో ఓ సిక్కు ఉన్మాది తాను మాస్టర్ తారాసింగ్‌నన్నాడు. ముష్టియుద్ధం జరుగబోయే తరుణంలో వాళ్లిద్దర్నీ ప్రమాదకరమైన వ్యక్తులుగా పరిగణించి వేరువేరు గదుల్లో ఉంచారు.

ప్రేమలో విఫలమై మతి స్థిమితం తప్పిన ఓ యువ హిందూ లాయర్ ఉన్నాడు. అమృత్‌సర్ ఇండియాలోకి వస్తుందని వార్తవినగానే దిగాలుపడిపోయాడు. తనను విఫల మనోరథున్ని చేసిన అమ్మాయి ఆ నగరంలోనే ఉంటుంది. అతనా ఉన్మాదస్థితిలోనూ ఆమె జ్ఞాపకాలను మరిచిపోయే స్థితిలో లేడు. అంచేత భారతదేశం ముక్కలవటానికి కారకులని తను అనుకున్న ముస్లిం, హిందూ లీడర్లను తిట్టనారంభించాడు. తన ప్రేయసి ఇండియాలో.... తాను పాకిస్తాన్‌లో ...

కొంతమంది ముస్లిం పిచ్చోళ్లు ఈ లాయర్ పిచ్చోడి దగ్గరికొచ్చి ఓదార్చే ప్రయత్నం చేశారు 'బాధపడి మనసు పాడుచేసుకోకు' అన్నారు. త్వరలోనే నిన్ను ఇండియాకు పంపుతార్లే, నీ ప్రేయసిని కల్సుకుంటావ్‌లే.... అన్నారు. కాని,

లాహోర్ ఒదిలెయ్యాలన్న ఆలోచనకూడా అతన్ని బాధపెట్టింది తన ప్రాక్టీస్ అమృత్‌సర్‌లో పడుపడం అన్నది నిరాశే.

యురోపియన్ వార్డులో ఇద్దరు ఆంగ్లో ఇండియన్‌లున్నారు. బ్రిటిషువాళ్ళు ఇండియాకు స్వాతంత్రిమిచ్చి వెళ్ళిపోయారనే వార్త వినగానే విషాదసాగరంలో మునిగి పోయారు. వెంటనే రహస్య సమావేశాలు మొదలుపెట్టారు. సొంత సమస్యలు చర్చకు వచ్చాయి. కొన్ని గంటల తరబడి సాగిన ఆ చర్చల్లో ప్రధానాంశం- 'ఈ ఆసుపత్రిలో ఇకమీదట తమ పరిస్థితి ఎలావుంటుంది? యురోపియన్ తిండీ దొరుకు తుందా? లేక ఆ వెధవ చెపాతీలే తినాలని బలవంత పెట్టరుకదా?

ఓ సిక్కు పదిహేనేళ్ళగా అక్కడ ఉంటున్నాడు. ఎప్పుడూ ఏదో లోగొంతులో కొన్ని మాటల్ని గొణుగుతుంటాడు. 'ఓ పర్డీ! గుడ్ గుడ్ దీ, అనేకాస్ దీ, బే ధ్యానా దీ, మూంగ్ దీ దాల్ ఆఫ్ డి లాంటెర్న్' అంటుంటాడు. ఆశ్చర్యమేంటంటే ఒక్క క్షణం నిద్రపోడు. రాత్రియినా పగలయినా బొడ్రాయిలా కూచునే ఉంటాడు. ఎప్పుడయినా కాస్త గోడకు జారగిలబడతాడంతే! ఎన్నో రోజులుగా గార్డులతన్ని గమనిస్తూనే ఉన్నారు. ఏమార్పు లేదు. దానివల్ల అతని కాళ్ళు బాగా వాపులొచ్చాయి. నొప్పులు కూడా అయ్యాయి. దానికి తోడు విశ్రాంతి లేకపోవడం. ఇండియా పాకిస్తాన్‌ల గురించీ జరుగబోతున్న పిచ్చివాళ్ళ తరలింపు గురించి ఎవరైనా అనుకుంటూ ఉంటే తీవ్రమైన ఏకాగ్రతతో ఒక్కో మాటనే గొణుక్కుంటాడు. 'ఓ పర్డీ, గుడ్ గుడ్ దీ అనేకాస్ దీ, బేధ్యానాదీ మూంగ్ దీ దాల్ ఆఫ్ ది పాకిస్తాన్ గవర్నమెంట్'. ఈ వరస అందరికి అలవాటైపోయింది.

కొన్నాళ్ళు 'పాకిస్తాన్ గవర్నమెంట్' బదులు 'తోబా తేక్ సింగ్' అనడం మొదలుపెట్టాడు. తోబా తేక్ సింగ్ అతని స్వగ్రామం. అదెక్కడుందో విచారణ మొదలుపెట్టాడు. కాని ఎవరూ అతన్ని పట్టించుకోలేదు. అతని దిగులును దూరం చేయడానికి సహకరించలేదు. ఆ ప్రదేశం ఎక్కడుందో చెప్పలేకపోయారు. అది ఇండియాలో ఉందో.... పాకిస్తాన్‌లో ఉందో....! మొన్నటివరకు ఇండియాలో ఉన్న సియాల్‌కోట్ నగరం పాకిస్తాన్‌లోకి పోయింది. ఈ పరిస్థితిలో లాహోర్‌కు

మాత్రం ఎవరు గ్యారంటి యివ్వగలరు? అదిప్పుడైతే పాకిస్తాన్‌లో ఉంది— అది కాస్త ఇండియాలోకిపోయి. ఇండియా పాకిస్తాన్‌లో అంతర్భాగంకాదని ఎవ్వరు మాత్రం చెప్పగలరు? పోనీ ఇండియా పాకిస్తాన్‌లు నీతిగా కొనసాగుతాయని, పరస్పరం ఈ భూమ్మీదినుంచి తుడిచిపెట్టుకుపోవడానికి ప్రయత్నించవని గ్యారంటీ ఏమిటి?

నూనె రాసుకోక, దువ్వుకోక ఆ సిక్కు పిచ్చివాడి జుట్టు మొహంమీద వాలిపోయింది. అంతకుముందే స్నానంచేసి ఉండటంవల్ల పీచుపట్టిన అతనిగడ్డం తుంపులు తుంపులయిన జుట్టు కలిసిపోయి అదో రకంగా తయారయింది. గత పదిహేనేళ్ళుగా ఎవరితోనూ తగూలాడిగానీ, వాదులాడిగానీ ఎరగడు. అక్కడ చాలాకాలంనుంచి పని చేస్తున్న ఉద్యోగులు— 'తోబా తేక్‌సింగ్'లో ఎకరాలకొద్ది భూములున్నాయని, అక్కడ తను మోతుబరి రైతు జీవితం గడిపాడని తెల్సు. హఠాత్తుగా అతన్ని పిచ్చి పట్టుకుంది. తర్వాత అతని బంధువులు కొందరు పెద్ద పెద్ద గొలుసులతో బంధించి ఆసుపత్రికి తెచ్చారు. పిచ్చాసుపత్రిలో చేర్చారు. నెలకోసారి వచ్చి అతని యోగక్షేమాలు కనుక్కొని పోతుంటారు మత కల్లోలాలు చెలరేగడంతో బంధువుల రాకపోకలు ఆగిపోయాయి.

ఆ సిక్కు పిచ్చోడి పేరు బిషన్‌సింగ్. కాని అందరూ అతన్ని 'తోబా తేక్ సింగ్' అంటారు. అతను పూర్తి మతిమరుపు స్థితిలో పడిపోయాడు. 'తోబా తేక్‌సింగ్' ఎక్కడుందో. తనీ పిచ్చాసుపత్రిలో చేరి ఎన్నాళ్ళయిందో యాదికిరాని దయనీయస్థితిలో పడిపోయాడు. కాని క్రమం తప్పకుండా నెలకోసారి వచ్చిపోయే బంధువుల రాకపోకలు గుర్తించాడు. వాళ్లాస్తారన్న రోజున పురి మరీ సబ్బు రాసుకుని శుభ్రంగా స్నానం చేస్తాడు. నూనె రాసి తల దువ్వుకుంటాడు. తన సొంత బట్టలకోసం అడుగుతాడు. బంధువులొచ్చి మాట్లాడుతుంటే నిశ్శబ్దంగానో, ఎప్పుడూ గొణుక్కునే మాటలను ఉచ్చరించడమో చేస్తాడు.

బిషన్‌సింగ్‌కు పదిహేనేళ్లు నిండిన ఓకూతురుంది. అందమయిన అమ్మాయి. తరచుగా తండ్రిని కల్సుకోవడానికి వస్తుంది. కాని తండ్రికి మాత్రం ఆమె ఎవ్వరో స్పృహలేదు. చిన్నప్పటినుంచి ఆమె వస్తూనే ఉంది, తండ్రిని చూసినప్పుడల్లా ఏడుస్తుంది.

భారత, పాకిస్తాన్ గొడవలు కుదిరిపోయాయి. బిషన్‌సింగ్ ప్రతి ఒక్క-డినీ 'తోబా తేక్‌సింగ్' ఎక్కడుందో వాకబు చేయడం మొదలుపెట్టాడు. సంతృప్తి కరమైన సమాధానం ఎవ్వరినుంచీ రాకపోవడంతో రోజు రోజుకూ అశాంతిగా తయారయ్యాడు. తనకోసం వచ్చే కూతురు, బంధువుల రాకపోకలు హఠాత్తుగా ఆగిపోయాయి. దానికితోడు ఇదీ.... అతను మరీ బాధపడిపోయి చచ్చిపోయారేమో లని దిగులుపడ్డాడు. తనవాళ్లు వచ్చినప్పుడల్లా పండ్లు, బట్టలు, స్వీట్లు తెచ్చేవారు. అతనికి లోలోపల ఉంది- వాళ్లు తప్పకుండా తోబా తేక్‌సింగ్‌నుంచే.... తనకు విస్తృతమైన పొలాలున్న తోబా తేక్‌సింగ్ నుంచే వస్తారు.

ఆ పిచ్చాసుపత్రిలో ఒక పిచ్చోన్ని అందరూ 'దేవుడు' అంటారు. బిషన్ సింగ్ ఆ దేవుడిని 'తోబా తేక్ సింగ్' గురించి అడిగాడు. ఆ దేవుడు ఆ ప్రశ్న విని వికటాట్టహాసం చేశాడు. ఏదైనా ప్రవచించబోయేముందు అట్లాగే చేస్తాడు. ఆ తర్వాత అన్నాడు. 'అది పాకిస్తాన్‌లోనూ లేదు. ఇండియాలోనూ లేదు. తోబా తేక్‌సింగ్ ఎక్కడుండాలో నేనింకా ఆదేశం జారి చెయ్యలేదు-'.

బిషన్‌సింగ్ 'దేవుడిని' మరోసారి వేడుకున్నాడు. కనికరించి 'తోబా తేక్ సింగ్' సమస్యని పరిష్కరించమని కాళ్ళావేళ్ళా పడ్డాడు. కాని 'దేవుడు' మాత్రం ఎప్పుడు 'బిజీ'గా కనిపించేవాడు తన దృష్టిలో ఇంకా చాలా సమస్యలున్నాయని చెప్తూ వచ్చాడు. ఓరోజు బిషన్‌సింగ్ ఆ దేవుడితో విసిగిపోయి "ఓ పర్డీ! గుడ్ గుడ్ దీ, అనేకాపదీ, హెహ్యానా దీ మూంగ్ దీ దాల్ ఆఫ్ వహీ గురూజీకా ఫాతే జో బోలే సో నిహాల్‌సత్ శ్రీ అకాల్!" అని బిగ్గరగా అరిచాడు. అతను 'దేవుని'తో అనాలనుకున్నదేమంటే నీ అధికారమంతా ముస్లింలకే పరిమితమైంది. ఒక వేళ నీవు సిక్కుల దేవుడివైతే నా ప్రార్థనలను తప్పకా మన్నించి ఉందువు అని.

పిచ్చివాళ్ళ తరలింపు ప్రారంభమయ్యే కొద్ది రోజుల ముందు 'తోబా తేక్ సింగ్' నుంచి బిషన్‌సింగ్‌ను చూడ్డానికి ఓ ముస్లిం మిత్రుడొచ్చాడు. అతనింత వరకెప్పుడూ రాలేదు. అతన్ని చూసి పట్టనట్టు బిషన్‌సింగ్ వెనుతిరిగాడు. కాని గార్డు ఆపి 'ఇతను నీ మిత్రుడు-ఫాజల్‌దీన్. నిన్ను చూడ్డానికి వచ్చాడు.' అన్నాడు.

వెళ్ళిపోయే తొందరలో ఉన్నట్టు నిలబడి గొణగడం మొదలుపెట్టాడు. ఫాజల్‌దీన్ ఒకడుగు ముందుకేసి బిషన్‌సింగ్ చేతుల్నీ భుజాల్నీ ప్రేమగా నిమిరాడు. "నేను చాలా రోజులనుంచి నిన్ను కలవాలని ప్రయత్నించాను- కాని ఫలించలేదు. ఈరోజు కలిశాం. మీవాళ్ళంతా క్షేమంగా సరిహద్దు దాటి భారతదేశం వెళ్ళిపోయారు. వాళ్ళకు నా చాతనయిన సహాయం చేశాను. నీ కూతురు రూప్‌కౌర్ ...." ఫాజల్ చెప్తున్న వాడల్లా ఆగాడు. మొగమాటపడ్డాడు. తడుముకొని. "....ఆమె కూడా బాగుంది. మిగతావాళ్ళతో కలిసి వెళ్ళిపోయింది" అన్నాడు చివరికి. మొగమాటాన్ని అణచుకోడానికి కాస్త టైం పట్టింది.

బిషన్‌సింగ్ మౌనంగానే ఉన్నాడు. ఫాజల్ మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు. "నీవాళ్ళంతా నిన్ను కాస్త చూసుకోమని చెప్పారు. నువ్విప్పుడు ఇండియాకు వెళ్తున్నట్టు విన్నాను- దయచేసి భాయ్ బల్‌బీర్‌సింగ్‌కూ భాయ్ వాధావాసింగ్‌కూ, అమృతకౌర్ బహన్‌కూ నా సలామ్ చెప్పు- బల్‌బీర్‌సింగ్‌తో చెప్పు.... ఫాజల్ బాగున్నాడు.... అతని రెండు గేదెలూ ఈనాయి.... ఒకటి పోతుదూడనీ, మరోటి పెయ్యని ఈనాయి- పెయ్య ఆరు రోజులు మాత్రమే బతికిందని చెప్పు.... నువ్వు వాళ్ళందరినీ కలవబోతున్నావు- వాళ్ళతో చెప్పు.... ఫాజల్ ఎప్పుడూ వాళ్ళకోసం ఏంచెయ్యడానికైనా తయారేనని చెప్పు.... మాటల్లోపడి మరిచాను- నీకోసం మిఠాయి తెచ్చాను" అన్నాడు.

బిషన్‌సింగ్ వెంటనే మిఠాయి పొట్లాన్ని అందుకుని గార్డుకిచ్చాడు- ఇచ్చి, ఫాజల్‌ను అడిగాడు- "తోబా తేక్‌సింగ్ ఎక్కడుంది?"

"ఎక్కడుంది? ఎక్కడుందో అక్కడే నిక్షేపంగా ఉంది" అన్నాడు ఫాజల్. అలా హఠాత్తుగా అడిగే సరికి ఫాజల్‌దీన్ తికమకపడ్డాడు.

"పాకిస్తాన్‌లోనా? ఇండియాలోనా?" బిషన్‌సింగ్ మళ్ళీ అడిగాడు.

"ఇండియాలోనా! కాదుకాదు పాకిస్తాన్‌లో ఉంది" ఫాజల్‌దీన్ జవాబిచ్చాడు. కాని ఎందుకీ సమాచారం అడుగుతున్నాడో అర్థంచేసుకోలేకపోయాడు ఫాజల్. బిషన్‌సింగ్ తన సహజమైన పదాలను గొణుగుతూ వెళ్ళిపోయాడు-

"ఓ పర్డి: గుడ్‌గుడ్ దీ, అనెక్స్ దీ, బేధ్యానా దీ, మూంగ్ దీ, దాల్ ఆఫ్ ది పాకిస్తాన్ అండ్ హిందుస్తాన్ దూర్ ఫట్టే మూన్."

తరలింపు కార్యక్రమానికి అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాయి. పోయేవాళ్ళ పేర్లూ, వచ్చేవాళ్ళ పేర్లు జాబితా తయారైంది. ఎట్టకేలకా రోజు రానేవచ్చింది.

అది శీతకాలం- చలిచలిగావుంది వాతావరణం. హిందూ సిక్కు పిచ్చివాళ్ళను తీసుకుని బస్సుల్లో బయలుదేరారు అధికారులు చుట్టూ పోలీసులు బందోబస్తు గట్టిగా ఏర్పాటు చేశారు. వాగాసరిహద్దువద్ద రెండు దేశాల సూపరింటెండెంట్లూ కలిశారు. కార్యక్రమం మొదలైంది. అది మరుసటిరోజు వరకు సాగుతూనే ఉంది.

బస్సుదిగి, తమను అప్పగించబోయే దేశం అధికారుల ముందు నుంచోమని పిచ్చివాళ్ళను నంజాయించారు. కాని చాలామంది బస్సు దిగటానికి నిరాకరించారు. బయటికి వచ్చినవాళ్ళు తలోదిక్కు పరుగెత్తటం మొదలుపెట్టారు. బట్టలు కట్టుకో దానికి నిరాకరించిన కొంతమంది పిచ్చోళ్ళు ఎంతచెప్పినా ససేమిరా అన్నారు. కొందరు పాటలు అందుకుంటే ఇంకొందరు తిట్లకెత్తుకున్నారు, చెవులు చిల్లులుపడే ఆ కోలాహలంలో ఏది చెయ్యాలన్నా కష్టసాధ్యమే! దానికితోడు ఆడపిచ్చివాళ్ళ నుంచి వచ్చే అరుపులు ఇంకా కల్లోలాన్ని సృష్టించాయి.

ఆ పిచ్చివాళ్ళలో చాలామందికి తాము బాగా ఎరుగున్న పరిసరాల్నుంచి తమని తరలించడం నచ్చలేదు పిచ్చి కాస్త తగ్గి, వివేకం పొడచూపిన కొందరు రెండు గ్రూపులుగా విడిపోయి. "పాకిస్తాన్ జిందాబాద్" అని ఒకరంటే. "పాకిస్తాన్ ముర్దాబాద్" అని ఇంకొకరు నినాదాలివ్వడం మొదలుపెట్టారు. పరిస్థితి చూస్తే రక్తపాతానికి చేరువగా వచ్చింది. కాని ఏ దుర్ఘటనకూ తావివ్వకుండా అది జరిగింది.

బిషన్‌సింగ్ వంతు వచ్చింది. అవసరమైన ఫారాలు నింపుతున్నప్పుడు బిషన్ అధికారులను అడిగాడు- "తోబా తేక్‌సింగ్ ఎక్కడుంది? పాకిస్తాన్‌లోనా? ఇండియాలోనా?" అధికారులు నవ్వి "పాకిస్తాన్‌లో...." అన్నారు. ఆమాట వినగానే బిషన్‌సింగ్ వెనక్కి తన సహచరులుండే చోటికి పరిగెత్తాడు. పాకిస్తాన్ గార్డులు అతన్ని ఇండియావైపు తోసే ప్రయత్నంచేశారు. కాని బిషన్‌సింగ్ ఒక్క అంగుళం కూడా కదలడానికి నిరాకరించాడు "నాకు తెలుసు.... నాకు తెలుసు.... తోబాతేక్‌సింగ్ ఎక్కడుందో!" అని గొంతుచించుకొని అరవడం మొదలుపెట్టాడు. "ఓ పర్దీ, గుడ్‌గుడ్ దీ, అనెకాస్ దీ, బేధ్యానా దీ, మూంగ్ దీ దాల్ దీ ఆఫ్ తోబా తేక్‌సింగ్ అండ్ పాకిస్తాన్" అని అరుస్తున్నాడు.

అతన్ని నమ్మించడానికి అన్ని రకాల ప్రయత్నాలూ జరిగాయి. "చూడు- తోబాతేక్‌సింగ్ ఎప్పుడో ఇండియా వెళ్ళిపోవడం జరిగింది. అలా జరక్కుంటే

## ఐది ధిక్కరణ

జాంగ్-జించో

నాకిప్పుడు 83 ఏండ్లు. నేను "ఆల్ చైనా ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్"లో పనిచేసి రిటైరయ్యాను.

మా నాన్న పడవ సరంగు. ఆయన నిజానికి హూపై ప్రాంతం వచ్చాడు. కాని పనిచేయటానికి అనువైనప్రాంతంలో ఉన్న 'వుహా' చేరారు. నేను బాల్యంలో చాంగ్‌జియాంగ్ (యాంగ్ట్జే) నది లోయలో పెరిగాను. 1914లో నా పదిహేనో పుట్టినరోజు తర్వాత కొన్నిరోజులకు అకస్మాత్తుగా పొడుగైన పందితోకలు కట్టుకున్న సైన్యం మిడతల దండులా మా ఊళ్ళోకొచ్చింది. పడిపోయిన క్వింగ్ రాజవంశాన్ని తిరిగి పూర్వస్థితికి తేవడానికి తీవ్ర ప్రయత్నాలు జరుగుతున్నాయి. దాని సామంతరాజు జాంగ్-క్సున్. వాళ్ళు దళానికి చెందినవాళ్ళు. అప్పుడు మా పక్కింటిపిన్ని వాళ్ళను చూసి "పందితోకలు కట్టుకున్న సైన్యం వచ్చింది. మీ బంధువుల్ని చూసుకోండి.

---

వెంటనే ఇండియా పంపడం జరుగుతుంది" అన్నారు అధికారులు. కాని అది అతని మీద ఎటువంటి ప్రభావం చూపలేకపోయింది. అధికారులతన్ని బలవంతంగా నెట్టాలనే ప్రయత్నం చేసినపుడు అతను ఇరు సరిహద్దుల నడుమ ఎవ్వరికీ చెందని నేలలో తనను తాను పాతేసుకుని వాసిన తన కాళ్ళతో నిల్చున్నాడు. ఇంక ఈ భూమ్మీది ఏ శక్తీ అతన్ని కదిలించలేదు. ఆ మనిషి ఇప్పుడు ఎవ్వరికే ప్రమాదకారి కాదు. ఇక అతన్నెవరూ హింసించలేరు.

సూర్యోదయం కాలేదింకా.... ఇంకా ధర్మంలా నిల్చిన బిషన్ కంఠంలోంచి చీకట్లని చీలుస్తూ ఒక హృదయవిదారకమైన ఆర్తనాదం దూసుకొచ్చింది. అధికారులు పరిగెత్తుకొచ్చారు ఆ మనిషిని చూడటానికి, పదిహేనేళ్ళుగా నిఖాగా నిల్చోవడంతప్ప కూర్చోడం తెలీని ఆ మనిషిని చూట్టానికి, తలవంచుకొని నేలమీద పడి పోయిన ఆ విచిత్రమైన మనిషిని చూడ్డానికి మాత్రమే అధికారులు పరిగెత్తుకొచ్చారు. సరిహద్దులవద్ద నాటిన ముళ్ళతీగెల కంచెకావల పడివున్న బిషన్‌సింగ్‌కు ఒక పక్క ఇండియా.... మరో పక్కన పాకిస్తాన్.... రెండు సరిహద్దుల మధ్య ఖాళీ జాగాలో ఎవ్వరికీ చెందని ఆ భూమిలో తోబాటేక్‌సింగ్ శవం పడిఉంది!

(ఆంగ్లం నుండి అనువాదం: దారి)

మీ వస్తువులు జాగ్రత్త చేసుకోండి." అంటూ అరిచింది. మా అమ్మ విపరీతంగా భయపడిపోయింది. నాకు త్వరలోనే హడావుడిగా పెళ్ళిచేసి అత్తవారింటికి పంపారు.

నా భర్తకప్పుడు 19 ఏండ్లు. ఆయన ఒక బడిపంతులు. ఆయన కొంచెం తెలివికలవాడు. పైగా ప్రావీణ్యం గల రాతగాడు ఆ రోజుల్లో పెళ్ళయిన ప్రతి స్త్రీ ఆయనెట్లాంటివాడైనా భర్తననుసరించాల్సిందే. నాకుమాత్రం మంచి మనిషే దొరికాడని సంతోషించాను. ఎట్లాగైతేనేం ఒక సంవత్సరం తర్వాత ఆయనకి కస్టమ్స్‌లో ఉద్యోగం దొరికింది. అప్పట్నుండి ఆయన మారిపోయాడు. ఆ రోజునుండి రాత్రిళ్లు ఇంటికి ఆలస్యంగా వచ్చేవాడు. రోజూ ఏదో తప్పు వెతికి నామీద మండిపడేవాడు. నా భర్త పూర్వం మనిషిలాలా లేడిప్పుడు.

ఆయన ఇంటినుంచి బయల్దేరినప్పుడు నేనోరోజు రహస్యంగా అనుసరించాను. ఆయన నియాన్ లైట్లతో వెలుగుతున్న ఒక అధునాతనమైన క్లబ్‌లో చేరి ఆడుతుండే చూసి ఆశ్చర్యపోయాను. ఆడంబరంగా అలంకరించుకొని డాంబికంగా ఉన్న ఆడవాళ్ళు కూడా ఉన్నారక్కడ. నేను లోపలికిపోయి ఆయనను తీసుకరావడానికి ప్రయత్నించాను కాని ఆయన నన్ను కోపంగా తోసేసాడు. నాకు ఏం చెప్పడానికి ధైర్యం లేక ఇంటికొచ్చాను. విషయమంతా అత్త మామలకు చెప్పాను. మామయ్యకు విపరీతంగా కోపమొచ్చింది నా భర్త ఇంటికిరాగానే మామయ్య ఆయనను బాగాకొట్టాడు. ఆయన సిగ్గుపడి అది అవమానంగా భావించి తన కోపమంతా నామీద వెళ్ళగక్కాడు కత్తితో నన్ను చంపుతానని బెదిరించాడు నేను తప్పించుకొని బైటపడి వీధుల్లో తిరగడం మొదలుపెట్టాను ఎవరిక్కూడా ఏం జరిగిందో చెప్పడానికి నేను సాహసించలేదు ఎందుకంటే ఎవ్వరుకూడా ఎదుటివాళ్ళ మురికిగుడ్డను శుభ్రం చేయరు.

నా భర్త ఇంకా దిగజారిపోయాడు. ఇంట్లో వున్న సామాన్లన్నీ చివరికి తన బట్టలతోసహా జూదంలో ఓడిపోయాడు. ఆయన ఈ దిగజారుడుకు నేనే సిగ్గుపడి, నాలో నేను దుఃఖించేదాన్ని, నాఖర్మ అనుకునేదాన్ని. ఓ రాత్రి ఉరేసుకొని ఈ దౌర్భాగ్య జీవితాన్ని ముగిద్దామనుకున్నాను. కాని సమయానికి పక్కింటి పిన్ని నన్నాపింది. "నీ పిల్లల మొహం చూడు వాళ్ళగురించి ఆలోచించు" అని చెప్పింది. నా చిన్నబిడ్డ పరిగెత్తుకొచ్చి నా కాళ్ళను చుట్టుకొని ఏడ్వసాగింది. నా హృదయం కరిగింది "నాకేం మార్గం లేదు" అన్నాను పిన్నితో.

"మన స్త్రీలకు కూడా రెండు చేతులు లేవా!" అంది. తను కంబళ్లు నేసి, బ్రతుకుతూ కుటుంబాన్ని పోషిస్తుంది. క్రమంగా నేను కోలుకొని జీవించడానికి ఓ మార్గం వెతుక్కున్నాను. నా భర్తనొదిలేసి పిన్నిదగ్గర కంబళ్లు నేయడం నేర్చుకున్నాను. ఇది నేను చేసిన మొట్టమొదటి విధి ధిక్కారం.

నా బిడ్డను తీస్కొని అమ్మవాళ్ళింటికి పోయొచ్చాను. రోజూ పొద్దున్నే లేచి రాత్రి పొద్దుపోయేదాకా కంబళ్లు నేసేదాన్ని. మిగిలిన వాళ్ళకన్నా ఓ కంబళి ఎక్కువ నేసేదాన్ని. మాకు సరిపడా సంపాదించగలనని నమ్మకం కుదిరింది. ఈ చిన్న పట్టణాన్ని వదిలిపెట్టి ఏదైనా కర్మాగారంలో పని చేయాలనుకున్నాను.

ఒకరోజు సరసు దగ్గర బట్టలుతుక్కుంటుంటే ఒకామె కలిసింది. ఆమె హాంకాలో కార్మికురాలు. మావూళ్లో పెళ్ళికొచ్చింది. ఆమె పనిచేసే కర్మాగారంలో స్త్రీలకు రోజుకు 49 సెంట్లు అని చెప్పింది. ఇది నాకూ, నా కూతురికీ మాత్రమే కాక నా తల్లితండ్రులకూ సరిపోతుందనిపించింది. "పాదాలు కట్టివేసిన స్త్రీని మీ మిల్లులో తీసుకుంటారా" అనడిగాను. "లేదు, అదో సమస్య కాద"ని చెప్పిందామె. "ఈ మిల్లులు ఇటీవలే స్థాపించబడ్డాయి. వాటికి కార్మికులు చాలా అవసరం. నీకోసారి పని ఇచ్చారంటే మంచంకోసం కొన్నిచెక్కలు, అన్నం తినడానికో గిన్నెకూడా ఇస్తారు".

నాకది చాలా నచ్చింది. ఇంటికి పరిగెత్తి నాన్నకు చెప్పాను. నేనక్కడ పని కోసం ప్రయత్నిస్తానని చెప్పాను. మానాన్న అనారోగ్యంతో మంచంలో పడ్డారు. ఒక్కమాటకూడా అనకుండా అంతా విన్నారు. ఆయన నన్నెంతగా ప్రేమిస్తున్నారో! అందుకే దూరంగా వెళ్ళిపోవడం ఆయనకిష్టం లేదని నాకు తెలుసు. కాని ఆయనకు "నాన్నా దీనిగురించి బాధ పడొద్దు. అన్నకూడా అక్కడే ఉన్నాడు కదా, నేను కావల్సినంత సంపాదించి మీ దగ్గరికి తిరిగొస్తాను" అని నచ్చచెప్పాను. కన్నీళ్ళు కారుస్తూ అంగీకరించారు. దుప్పటి మొహంమీద కప్పుకొని వెక్కసాగారు.

నేనో పడవలో హాంకౌ బయల్దేరాను. మొదట యహౌ బట్టల మిల్లులో పనిచేసి తర్వాత ఇంకోదాంట్లో చేసాను. ఆరోజుల్లో కార్మికులు కనీసం జీవించడానికి కష్టించేవారు. మేం చిన్న ఇరుకైన గుడిసెల్లో నివసించేవాళ్ళం. తెల్లవారకముందే బయల్దేరి రోజంతా ఆ మురికి కూపాల్లో కష్టించేవాళ్ళం. ఒకసారి కర్మాగారంలో అడుగు

పెడితే చాలు 12 గంటల కాలం ఆ కిక్కిరిసిన తేమ గదుల్లో పనిచేసేవాళ్ళం. ఇక వేసవికాలం వస్తువులేవి వాడడానికి వీల్లేకుండా ఉండేవి. మాకు విపరీతంగా చెమట పట్టి మా బట్టలు ఒంటికి అతుక్కుపోయేవి. చాలమంది స్త్రీలు వాళ్ళ మగ్గాల దగ్గర స్పృహ తప్పేవారు. ఒకసారి పనిభారంతో నేనూ అధిక రక్తస్రావంతో బాధపడ్డాను.

నేనొచ్చిన కొన్నాళ్ళకి మా నాన్న చనిపోయాడు. నేను వెళ్ళి నా బిడ్డను తీసుకొచ్చుకొన్నాను. జీవితం కష్టతరమైపోయింది. మొదట్లో పాపనింట్లో వదిలిపెట్టి పనిలోకి వెళ్ళేదాన్ని. కాని ఓరోజు నేను తిరిగొచ్చేవరకు ఇంకేముంది! తలక్రిందులు కాళ్లమీదుగా ఓ వెదురుబుట్టలో పడిపోయి బయటకు రావడానికి ప్రయత్నిస్తోంది పాప. అట్లా ఎంతసేపయిందో విపరీతంగా ఏడుస్తుంది. అందుకని ఆరోజు నుండి నాతో పాటు రహస్యంగా తీసికెళ్ళి మరుగుదొడ్డి వెనక ఉంచేదాన్ని. కాని కొన్నాళ్లకే ఆ విషయం మా ఫోర్‌మెన్ చూసాడు. ఎవరు తీస్కొచ్చారని కేకలేసాడు నామీద. పాప బెదిరి ఏడ్వడం మొదలెట్టింది. నేనూ ఏడ్చాను. కార్మికురాలిగా నా జీవితం ఇలా మొదలయింది. 1925లో తయాన్ బట్టల మిల్లులో పని చేయడానికి వెళ్ళేదాన్ని. ఒకరోజు మిల్లు గేటుముందు మేమంతా పిచ్చాపాటి మాట్లాడుకుంటుండగా వాంగ్ అనే కార్మికుడు మాతో కల్సాడు. ఆయనకు 30 ఏండ్లు. ఆయన కర్ర సహాయంతో నడుస్తాడు. ఆయన చాలా నిజాయితీపరుడని తెల్సింది. అందుకని ఆయనతోకూడా మాటలు కలిపాను. కొన్నాళ్ళకి మా మధ్య చనువేర్పడ్డాక నేనాయన కాలు గురించి అడిగాను.

"మిస్టర్ వాంగ్, మీరు పుట్టుకతోనే కుంటివారా లేక మిషన్‌లోగాని, లేక ఏవిధంగానైనా మీ కాలు పోయిందా?"

"కాదు, ఇది కుక్కకాటు"

"కుక్కా? ఏ రకమైన కుక్క" అనడిగాను ఆశ్చర్యంగా

ఆయన నవ్వి "ఇది కార్మికులను పీడించే కుక్క. అంటే యజమానులు, ఫోర్‌మెన్‌లని అర్థం" అన్నాడు.

నాకు తర్వాత తెల్సింది. ఆయన కాలు కార్మికుల సమ్మెలో దెబ్బ తిన్నదని. ఆయన హెనాన్ ప్రాంతంలోని బట్టల మిల్లులో పని చేసేవాడు. కాని అది కాలిపో

యింది. ఆయన కమ్యూనిస్టు. పైగా 1923 ఫిబ్రవరి 7న జరిగిన రైల్వే కార్మికుల సమ్మెలో పాల్గొని ధర్నా చేసారు. అప్పట్నుండి వాంగ్ రోజూ నన్ను చూడ్డానికి వచ్చేవాడు. కొన్నిసార్లు మా మిల్లులో పనిచేసే విద్యార్థులను తీసుకొచ్చాడు. మేమంతా మంచి స్నేహితులమయ్యాం.

1925 మేలో షాంగై ప్రజలంతా జపాన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా గొప్ప ఉద్యమం లేవదీసారు. ఎందుకంటే షాంగైలో జపాన్ సామ్రాజ్యవాదుల మిల్లులో జరిగే దోపిడీ దౌర్జన్యాల ఫలితంగా చైనా కార్మికుడు చంపబడ్డాడు. మే 30న విదేశీ విభాగాల్లో ఉన్న సామ్రాజ్యవాదులు అమాయక ఖైదీలను విడుదల చేయాలని ధర్నా చేస్తున్న ప్రజలపైన కాల్పులు జరిపింది. దాంతో "మే 30 ఘోర హత్య" అంటూ దేశమంతా వ్యతిరేకోద్యమాలు జరిగినయ్. మేంకూడా హాంకౌలో జరిగిన వ్యతిరేక పోరాటంలో సమ్మెకారులతో కలిసాం. ఆరోజుల్లో మేం పగలంతా సమ్మె చేసి రాత్రి రాజకీయాధ్యయనం తరగతులు పెట్టుకునేవాళ్ళం. మాకు బాతులకొట్టం తరగతి గది. మా కార్మిక విద్యార్థులే గురువులు. వాళ్లు మాకు ఓ పాట నేర్పారు.

"సామ్రాజ్యవాదం నశించాలి....
యుద్ధ ప్రభువులు నశించాలి...."

వాళ్ళింకా మాకు ఇలా చెప్పేవారు. "రెండు కర్రల్ని విరవడం సాధ్యమే కాని, ఓ కట్టగా ఉన్న కర్రల్ని విరవడం కష్టం అలాగే మనం కార్మికులమంతా ఒకే కట్టుగా నిలబడాలి" దాన్ని నేను పూర్తిగా విశ్వసించాను. గత జన్మలో పాపాలు చేస్తారు కనుకే పేదవాళ్ళు, ముఖ్యంగా స్త్రీలు ఇప్పుడు బాధపడ్తున్నారని గతంలో అనుకునేదాన్ని. కాని ఇప్పుడు మా ఉపాధ్యాయులు "విధి అనేదేంలేదు. ఒకవేళ నువ్వూ నీ యజమాని ఒక నదిలో పడిపోతే మీకు ఈతరాకపోతె ఇద్దరూ మునిగి పోతారు. కాని అసలు విషయం ఆయనకొకవేళ జబ్బుచేస్తే డబ్బులిచ్చి డాక్టర్ను తీసుకొస్తాడు. కాని నీవలా చేయలేవు" అని చెప్పేవారు. నిజంగా ఈ విషయాలు నన్నాలోచింప చేసాయి. అంతా అయింతర్వాత నాకేదో ఆశ కల్పించసాగింది.

1926లో నాకిరవైఏడేళ్ళు. ఏప్రిల్ లో ఓ రోజు మా విద్యార్థి కార్మికుడు హా-షుషెన్ మా యింటికొచ్చి మాట్లాడుతూ

"నువ్వు శాఖాహారివని విన్నాను నిజమేనా" అనడిగాడు. నేను నవ్వి తలూపాను.

వెంటనే "ఎందుకని నేనడగొచ్చా? నువ్వుకూడా బౌద్ధ మతము నమ్ముతావా?" అనడిగాడు.

"నేను పేదదానిగా పుట్టాను. కనుక నా ఆశలన్నీ ఇవ్వాల్టితో పోల్చుకుంటే భవిష్యత్తు గురించే"

ఆయన నవ్వి "వచ్చే జీవితం గురించెందుకు ప్రార్థిస్తావు? ఈ జీవితంలో ఆశలు లేవా?" అన్నాడు.

ఇది నాకింతవరకూ తట్టలేదు.

"నేననుకున్నది జన్మలో సాధించగలనా!" అనడిగాను.

"తప్పకుండా. వేలమంది పేదవాళ్ళకోసం, వారి బ్రతుకు బాగుపరచడానికై ఒక సంస్థ ఉంది. ఇందులో చేరటం బుద్ధిజం కంటే మంచిది. నువ్వేమనుకుంటున్నావ్?" అనడిగాడు.

"వర్తమానంలో జీవించడానికి శ్రమించటం, వచ్చే జన్మలో పుట్టడంకన్నా గొప్పది. ఇది నాకు చాలా నచ్చింది. నేనందులో చేరాలనుకుంటున్నాను. ఆసంస్థ పేరేమిటి?" అనడిగాను.

"చైనా కమ్యూనిస్టు పార్టీ. ఇది కార్మికుల సంఘం"

నా ఆలోచనా శక్తి పెరిగింది. నేను తప్పకుండా పార్టీ కార్మిక ప్రతినిధిగా విజయం సాదిస్తాను. ఇది నా జీవితంలో గొప్ప మార్పు.

గతంలో నేను కష్టించి పనిచేసి డబ్బు సంపాదించి మా అమ్మనూ, పాపనూ పోషిస్తూ ఆదర్శ గృహిణిగా జీవించాలనుకునేదాన్ని. కొన్నాళ్ళకు స్త్రీల మతంలో చేరేదాన్నే. కానీ నాముందు ఇప్పుడు గొప్ప ఆశయం, భవిష్యత్తూ ఉన్నాయి పైగా నేను చైనా కమ్యూనిస్టుపార్టీని కడవరకూ అనుసరిస్తానని నిశ్చయించుకున్నాను.

1926లో బూర్జువా విధానాన్ని, సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకిస్తూ అనేకమంది కార్మికులు, కర్షకులు, విద్యార్థి, మేధావులూ ఒకరేంటి ప్రజలంతా తమ జీవితాల్ని పణంపెట్టి పోరాడ్డానికి ముందుకొచ్చారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రాబల్యం వల్ల గాంగ్‌జా ప్రభుత్వం జులైలో ఉత్తర దండయాత్రకు సైన్యాన్ని పంపింది. కార్మిక, కర్షకులతో బయల్దేరిన ఈ సైన్యం అక్టోబర్‌లో వుహాన్ * పట్టుకుంది.

ఈ విప్లవ విజయ పరంపర మా కార్మిక సంఘంతో సమ్మెలూ, ధర్నాలూ చేయించింది. నేను మా స్త్రీ సంఘానికి అధ్యక్షురాలిగా ఎన్నికయ్యాను. మా సంఘంలోని సభ్యులు చాలామంది 'బంధింపబడ్డ పాదాలు' కలవాళ్ళే. మేం రోజూ ఆరుబయట మగవాళ్ళకేం తీసిపోకుండా వ్యాయామం, మార్చ్‌ఫాస్ట్ చేసేవాళ్ళు. దారిన పోయేవాళ్లు ఆగి, ఇదిచూసి నవ్వేవాళ్లు. కానీ ఇందులో ఆనందించడానికి నాకేం కనిపించలేదు. ఈ బూర్జువా కట్టుబాట్లు మమ్మల్నింతగా అణచేసాయి. ఇప్పటికీ ఈ 'పాదాలు బంధించడం' మీద మేం విప్లవం లేవనెత్తలేదు.

ఈ పనులు చూస్తూ నేను రోజుల తరబడి బయటే ఉండేదాన్ని. మా అమ్మ ఆందోళనపడి పాపతో "మీ అమ్మ ఈసారొస్తే నిమిషం ఉండిపోవడం కాదు, పని పూర్తి చేస్తేగాని వెళ్ళడానికి వీల్లేదు. అమిప్పుడేం చేస్తుందీ? అట్లా మగవాళ్ళతో కలిసి పనిచేయడమేంటి? ఇంకేముందీ ఆమె బయట ఎవర్నైనా పెళ్ళిచేసుకుంటే నీ బ్రతుకేంగానూ" అనేది. మా పాప గట్టిగా నవ్వుతూ "అమ్మమ్మా బాధపడకు అమ్మ బయట ఎవర్నీ పెళ్ళి చేసుకోదు. ఆమె విప్లవంకోసం పనిచేస్తోంది " అని చెప్పేది. ఈ సమాధానం మా అమ్మకు కాస్తా తెరిపినిచ్చింది.

1927, మార్చ్ 8న నేను మా సంఘాన్ని 'కార్మిక స్త్రీల దినోత్సవాన్ని జరుపుకోడానికి ఊరేగింపుగా తీసుకెళ్ళాను. సాధారణ కార్మిక సంఘ అధ్యక్షుడు జియాంగ్ జోంగ్‌సా సభకు అధ్యక్షత వహిస్తున్నాడు. సభ మధ్యలో ఆయన హడావిడిగా లేచి "నేను తప్పకుండా ఒక చోటికి వెళ్ళాలి. మా కార్మిక సంఘం తరఫున నా బదులు నువ్వేమైనా మాట్లాడగలవా?" అనడిగి నా సమాధానం వినకుండానే వెళ్ళిపోయాడు. నాకయోమయంగా ఉంది. పైగా ఏం మాట్లాడాలో తెలీదు. ఏం చేయాలో అర్థంకాలేదు.

---

* చాంగ్‌జియాంగ్ నది ఒడ్డున ఉన్న ఉచాంగ్, హాంకౌ, హాన్యాంగ్ అనే 3 పట్టణాలకు కలిసి వుహాన్ అని పేరు పెట్టారు.

కానేపటికి సభలోంచి నన్ను మాట్లాడమంటూ జనం కేకలు వేసారు నేను అప్పుడప్పుడనుకుంటాను- అట్లా మాట్లాడటానికి నాకంత ధైర్యమెలావచ్చిందా అని.

నేను నా జీవిత చరిత్ర చెప్పి చివరికి "స్త్రీ అనేక విధాలా కష్టపడ్తుంది మనం స్త్రీల కష్టాల నివృత్తికోసం పాటుపడాలి. మనమంతా సామ్రాజ్యవాద, బూర్జువా విధానాల క్రింద అణచబడుతున్న వాళ్ళమే. కారణం మనం పేదవాళ్ళం కాస్తా డబ్బున్న మధ్యతరగతి ఆడపిల్లలు ధనంగల భర్త దొరక్క బాధ పడ్తున్నారు. యుద్ధ ప్రభువుల ఉంపుడుగత్తెలు మిగతా స్త్రీలతో కలవలేక బాధపడ్తున్నారు. ఎలా గైతేనేం? స్త్రీలంతా కష్టాలనుభవిస్తున్నవారే. మనం మగవాడి ఆటబొమ్మలం కాదని చెప్పాలి. మనం విధిని నమ్మకూడదు. మనం లేచి నిలబడి స్వేచ్ఛకోసం, న్యాయం కోసం పోరాడాలి" అని ముగించాను.

దద్దరిల్లేలా చప్పట్లు మ్రోగాయి. ప్రజలు విప్లవంలో కాకలు తీరారు. దాంతో నేనికూడా కార్మికోద్యమంలో ముఖ్యురాల్నయ్యాను. 1927 ఏప్రిల్‌లో హాంకౌలో మిలిటరీ శిక్షణా సమావేశం జరిగింది. చైనా కమ్యూనిస్టుపార్టీ ఐదవ జాతీయ కాంగ్రెసుకు వెళ్ళమని కేంద్ర కమిటీ నన్నడిగింది. అక్కడ నేను అధ్యక్ష సంఘంలో సభ్యురాలిగా ఎన్నికయ్యాను. అప్పట్నుండీ నేను విప్లవానికి కారణభూతులైన చైనా కార్మికవర్గంతోని పని చేస్తున్నాను.

(ఇంగ్లీషునుంచి అనువాదం)

---

నబరుణ్ భట్టాచార్య కవితలో ప్రస్తావించబడిన ఎనిమిది బారసాత్ పోలీసు హత్యలు

1. కానాయి భట్టాచార్య (35), బెల్‌ఘోరియా టెక్స్‌మాకో ఫ్యాక్టరీ కార్మికుడు
2. జతీన్ దాస్ (36), టెక్స్‌మాకో ఫ్యాక్టరీ కార్మికుడు
3. తరుణ్ దాస్ (14), అరియాదాహాలోని కాలాచంద్ హైస్కూల్ విద్యార్థి
4. సమీమిత్రా (18), బిఎస్‌సి రెండో సంవత్సరం విద్యార్థి
5. గణేశ్ ఘటక్ (19), బిఎస్‌సి (ఉత్తర్‌పరా పీరీమోహన్ కాలేజ్)
6. శంకర్ ఛటర్జీ (21), ఎంఎస్‌సి (జువాలజీ) కలకత్తా యూనివర్సిటీ
7. స్వపన్ పాల్ — వివరాలు తెలియవు
8. సమరేంద్ర దత్తా — వివరాలు తెలియవు

# ప్రజాస్వామ్యం

పి చందు

"ఈ ఎలక్షన్ల ఏమోగాని మన ప్రాణాలు తినేస్తుంది" దుప్పటి ముసుగును గట్టిగా బిగించుకుంటు, రివ్వున వీస్తున్న చల్లగాలిని తప్పించుకునే ప్రయత్నం చేస్తు అన్నాడు.

లారీ వేగంగా దూసుక పోతుంది. ముసక చీకట్లో ఆకాశాన్ని తాకుతున్నట్టుగా ఉన్న చెట్లను, చెట్లమాటున దాగి ఉన్న చిక్కటి చీకటిని చూస్తుండిపోయాను. నాకు అడివి ప్రాంతంలో తిరగటం కొత్త. పుస్తకాల్లో, కథల్లో బొమ్మల్లో చూసిన, నేను ఊహించుకున్న అడివికి, వాస్తవంగా కనిపిస్తున్న అడివికి ఎంతవ్యత్యాసముందో పరిశీలిస్తుండి నా మిత్రుడి మాటలు విన్పించుకోలె.

"చల్లగా ఈదరేస్తుంటే ఏంటీ అలా నిలబడి చూస్తున్నావు చక్కగా కూచొని నీ దగ్గరున్న దుప్పటితో ముసుగేసుకో చలిదెబ్బ కొట్టేదుంటే మందుండదు మాకుండదు ఊరికే వచ్చి పూడుకుంటావు"

నేను నా మిత్రునికేసి చూసాను. నా మిత్రుడు మధుతోపాటు ఆ రూట్లో ఉన్న పోలింగ్ బూత్‌లో పన్జేసేందుకు పోలింగ్ ఆఫీసర్లు, ప్రిసైడింగ్ ఆఫీసర్లు తమకు అప్పజెప్పిన ఎన్నికల సామాను గోనెసంచుల్లో మూటలు కట్టుకొని వాటిమట్టు ముసుగులు తన్ని కునికిపాట్లు పడుతున్నారు

"ఏంరా వినబడుతలేదా' నా చొక్కపట్టి లాగాడు. నేను వాడిపక్కన కూలబడ్డాను. నిజంగానే బాగా చలిగా ఉంది, డిసంబర్ మాసపు చలి మనుషులను కొరికేస్తుంది. గుంపు మధ్యలో కూచునేసరికి కాస్త వెచ్చగా హాయిగా ఉందికూడా. నా జేబులు తడుముకున్నాను సిగిరెట్టు కోసము లాభము లేక నా మిత్రుని జేబు తడమాను చెరో సిగిరెట్టు వెల్గించుకొని హాయిగా దమ్ములాగుతూ 'మనం ఎంతదూరం వచ్చామో తెల్సా' అన్నాడు.

తెల్వదన్నట్టు తలూపాను.

"రాత్రి మనం బయల్దేరేసరికి రెండయింది, ఇప్పుడెంతయిందో తెల్సిందా పావు తక్కువ ఐదు. ఇంకో పావుగంటయితే మూడు గంటలు. మనం మన గమ్యం చేరుకునేసరికి ఉదయం పదిగంటలవుతుందేమో?"

"అంత దూరముందేమిటి"

"దూరమంటే దూరమే అది కాకుండా మన పోలింగ్ బూతే చివరిది. వీళ్ళందరినిదించి మన గమ్యం చేరుకునేసరికి అంతే పైపోతుంది. నీకైతే కొత్తగా వచ్చుగాని నాకు ఎలక్షను డ్యూటి ఇది మూడవసారి. ఎప్పుడుకూడా ఇలా అడవులు పట్టుకొని తిరగాల్సిన కర్మపట్టలేదు. ఎంచక్కా 'సిటీ'లనే పడేది. మనకు కావల్సిన ఇంతజామ్ బహు జోరుగా ఉండేది. ఇప్పుడెలా ఉంటుందో ఏమో." కాస్త రంది పడుతున్నట్టుగా.

"ఎప్పుడు తిండి జానయేనా మనం పనిగట్టుకొని చూస్తామా చెప్పు" కొద్దిగా ఉత్సాహం పరుస్తామని.

"ఏముందిరాబాబు చూడటానికి అడివిలో" ఇంకా ఏదో చెప్పబోయినోడు లారీ రోడ్డుమీద మలుపు తిరిగేసరికి ఒకసారిగా మొగ్గిండు. రోడ్డుమీద దుమ్ము పెద్దగా లేచి మమ్మల్ని ఆవరించింది. అలా కొద్దిదూరం వెళ్ళేసరికి నాలుగైదు ఇండ్లున్న ఊరొకటి వచ్చింది.

"39వ పోలింగ్ బూత్ వచ్చింది. 39 పోలింగ్ బూత్ పోలింగ్ ఆఫీసర్ప ప్రిసైడింగ్ ఆఫీసరు ఎస్కార్టు దిగుండ్రి" మాకు రూట్ గైడుగా ఉన్నతను క్యాబిన్లో కూచొని పెద్దగా నోరు తెరుచుకొని అరవటం మొదలు పెట్టిండు.

పోలింగ్ ఆఫీసర్సు, ప్రిసైడింగ్ ఆఫీసరు ఎస్కార్టు దిగిపోయారు. లారీ వెంటనే బయలుదేరలేదు. రూట్ ఆఫీసరు కోసం చూస్తుండిపోయారు. కాసేపు అయిన తర్వాత రూట్ ఆఫీసరు సల్లుట సాయుధబటులతో వచ్చాడు. వచ్చి రావటం తోటే ఊరి పటేల్ను పిలిచి 'తిండి ఏర్పాట్లు ఎలా ఉన్నాయో' అడిగిండు, అన్ని సరిగానే ఉన్నాయని తెల్సుకొని మళ్ళీ అక్కడినుండి బయలుదేరారు.

మాలారీ 'పెంటీ' చేరుకునేసరికి సూర్యుడు చెట్ల చాటునుండి దాగుడుమూతలు ఆడుతున్నాడు. రాత్రింతా నిదురలేక అందరి ముఖాలన్ని పీక్కుపోయాయి 'మనకు ఇంతకంటే మంచి స్థలం ముందెక్కడ దొరకదు. ముఖాలు గిట్లా కడుక్కునేదుంటే ఇక్కడే కడుక్కోండి' రూట్ గైడ్ హెచ్చరిక విని. అందరము లారీలు దిగి బిలబిలమంటు జిల్లా పరిషత్తు స్కూల్ ఆవరణంలో ఉన్న బావికేసి నడిచా.

తిగ్గి అక్కడినుండి బయలుదేరేసరికి ఉదయం తొమ్మిదైంది. ఎండ చిట పటలాడుతుంది. చెట్లచాటునుండింకా చల్లగాలి వీస్తుంది. నేను అడివిలోకి చూపు అందినంత మేరకు చూస్తుండిపోయాను నా తాపత్రియమంతా అడివిలో ఏమైనా జంతువులు అగుపిస్తాయేమోనని కాని ఏం కనిపించలేదు ఆడివిలో చిన్న చిన్న బోడులు వాటిమీదికి కూడా వ్యాపించిన చెట్లు, చిన్న చిన్న కాలువలు, ఎత్తుపల్లాలు. బాగా ఏపుగా పెరిగిన చెట్లు అడివి మొత్తంగా పచ్చగా ఉంది.

ఆదిలాబాద్ ప్రత్యేకత గురించి, సహజ సంపదల గురించి అక్కడి గిరిజనుల గురించి నాతోటే ప్రయాణిస్తున్న ఓ తెలుగు పంతులు అతని ప్రక్క కూచున్న అతనితో చెప్పుతున్న విషయాలు నాకు చాల ఆసక్తి కలిగించాయి. అటువైపు చెవి మొగ్గాను.

"ఈ ఆదిలాబాద్‌లోని గోండులు, కొలామ్‌ల భాషకు ఎంత ప్రాచీన చరిత్ర ఉందో మన తెలుగుకు అంతే ప్రాచీనత ఉంది కాకుంటే కాలక్రమేణ తెలుగువారు రాజ్యాలు ఏలటము తద్వారా తెలుగు భాషకు రాజాదరణ కల్గటము వలన అది బాగా అభివృద్ధి చెందింది అందుకే మన తెలుగు భాష ప్రారంభ దశలో ఎలా ఉందో అధ్యయనం చేసేవారికి ఈ గోండు కొలామ్ భాషలు అధ్యయనం చేస్తే మరికొంత విషయం తెల్వచ్చు "

నాకా మాస్టరు మాటలు ఆసక్తి కలిగించినయి. ఉత్సాహాన్ని ఆపుకోలేక 'మరిక్కడి గిరిజనుల జీవన పరిస్థితి ఎట్లా ఉంటుందంటారు మనం ఇంత దగ్గర్లో పున్నా వారి జీవన విధానం ఏమిటో తెలియదు'

ఆ బోడితల తెలుగు మాస్టరు ఒక్కసారి నావైపు చూసి 'ఎవడి బ్రతుకు వాడు బ్రతకటమే కష్టమపోతుంటే ఇంకొకని గురించి పట్టించుకొనే తీరికెక్కడిది. నేను ట్రైబల్ టీచరుగా పనిచేస్తున్న రాబట్టి పద్దనుకున్నా వాళ్ళ బ్రతుకుల గురించి అంతో ఇంతో అవగాహన చేసుకోవటం జర్గింది."

కాసేపు ఆగి దీర్ఘంగా నిట్టూర్చి మళ్ళీ చెప్పటం మొదలు పెట్టాడు.

"అడవుల్లో జంతువులతీర్గ బ్రతుకుతున్నారు. ఒక్కొక్కసారి చూస్తుంటే వీళ్ళకంటే జంతువులే నయమనిపిస్తుంది. ఏదో ఇంత భూమి దున్ని గింజలువోస్తరు.

పక్షులు, జంతువులు మిగిల్చినయి అదైనా సరిగా వర్షాలు సమయానికిపడ్తేనే ఓ రెండు మూడు నెలలు పొద్దుపోతది. ఇంకా ఆ తర్వాత ఆకులు అలుములు తింటరు అరుగాలాలుపాటుపడ్డా బువ్వకెప్పుడు కటకటే, ఇకపోతే ఆదిలాబాద్ పత్తిపంటకు ప్రసిద్ధి అంటరు. గా పత్తిపంట భూములన్ని మైదాన ప్రాంతమునుంచి వచ్చిన షావుకార్ల చేతిలోనే ఉన్నాయి. గిరిజనుల భూములు కొనద్దు అమ్మద్దని చట్టాలున్నాయి అవన్ని కాగితాలల్లనే. ఇకపోతే ప్రభుత్వ కో-ఆపరేటివ్ సొసైటీలున్నాయి. వాట్లై ఉన్నంత దోపకము దునియాల మరెక్కడ కన్పించదంటే నమ్ము."

అతనింకేదో చెప్పటానికి సిద్ధపడుతుండగానే లారీ మరోచోట ఆగింది. నలభైనెంబరు బూతువచ్చింది. దానికి సంబంధించినవాళ్ళు దిగండి' అంటూ అప్పడికే మాకంటే ముందుచేరిన మారూట్ ఆఫీసరు ఆగిన లారిముందుకొచ్చి చెప్పిండు.

అ తెలుగు పంతులు మరో నల్గురు వాళ్ళ ఎస్కార్ట్ దిగిపోయిండ్లు.

నలభై ఒకటవ నెంబరుగల మా పోలింగ్ బూతుకు పోవాలంటే అక్కడినుండి రిజర్వు ఫారెస్టులో 15 మైళ్ళు బండిబాటన పోవాలి

'ఇక ఇక్కడినుండి లారీ నడువది. అందరుకల్సి ఒకేజీపులో వెళ్తేమంచిది. మా రూట్ గైడ్ మాటలు వినిపిస్తున్నాయి.

"ఏదో ఒకటి తొందరగా తెమల్చండయ్యా" విసుగ్గా అన్నాడు. రూట్ ఆఫీసరు బరా బరా గడ్డాన్ని గోక్కుంటు.

లారీనుంచీ మా పోలింగ్ బూత్ సామాను తీసుకొని ఒకే జీబులో సర్ది రూట్ ఆఫీసరు, రూట్ గైడు, నల్గురు పోలీసులు, మా ప్రిసైడింగ్ ఆఫీసర్‌తో కల్సి మేం నల్గురం ఒకే జీబులో కూరుకపోయి కూచున్నాం.

గతుకుల రోడుమీద జీబు ముందుకు సాగింది. రోడు కడ్డంగా ఉన్న కొయ్యలను తప్పించలేక డ్రైవర్ ఇబ్బంది పడిపోతు "ఇటువంటి రూట్‌లో నా సర్వీసులో రాలేదు సార్" అన్నాడు.

'అంతేకదా మీ ఆఫీసువాళ్ళకు అడవులతోని ఏంపని. అంతా సిటీలనే తిరుగుడాయే" రూట్ ఆఫీసరు.

"ఏం ఆఫీసు" అతని పక్కన కూచున్న పటేలు.

"కమర్షియల్ టాక్సు ఆఫీసుసార్"

హఠాత్తుగా జీబు ఒక్కసారి చిన్న గయ్యిలో దిగబడింది అందరం దిగి నెట్టితేగాని మళ్ళ కదిలింది కాదు.

"వారెవా బలేరూట్‌లో పడ్డామయ్యా" మా ముసలిప్రిసైడింగ్ ఆఫీసరు నడుం మీదచెయ్యేసుకొని తీడుకుంటా అన్నాడు.

'నడుమునొప్పా సార్' అన్నాడు మధు జోగ్గా.

"డ్యూటీకదా సార్ తప్పుద్దా" రూటు ఆఫీసరు మా ప్రిసైడింగ్ ఆఫీసరుకు మద్దతుగా పలికిండు.

"క్యాసాబ్ హమారే జైసా వోల్డ్ ఫెలోస్‌కు ఈ రూట్లో వేయిస్తే ఎలాగండి మళ్ళీ ప్రాణంతో తిరిగిపోగలమా" రూటు ఆఫీసరును ఉద్దేశించి మా ప్రిసైడింగు ఆఫీసరన్నడు.

"మీరేం భయపడకండి సార్, మిమ్మల్ని పువ్వుల్లోపెట్టి తిర్గి పంపిస్తం"

"అంతే అయితట్టుంది పువ్వులతోపాటు నాల్గు చప్పుల్లు కూడా తెప్పించండి ఏకంగా కైలాసం పోవచ్చు. అసలింతకూ మీరీ రూట్లో ఇదివరకెప్పుడైనా వచ్చారా?"

"అబ్బే ఈ రూట్ల ఇదివరకెప్పుడు రాలేదు కాకుంటే నిన్న ఒక్కసారి ఈ రూటు చూసేందుకు వచ్చినం"

జీబు మరోసారి రోడ్డును అడ్డంగా చీల్చిన ఒర్రెలోనుండి ఎంతకు కదలలేదు. "మరోసారి మీరంతా దిగాలి సార్" డ్రైవర్ నీరసంగా అన్నాడు.

మరోసారి అందరు దిగి తోస్తేగాని కదిలింది కాదు జీబు. అప్పటికే నెత్తి మీదకు వచ్చిన సూర్యున్ని చెట్లు కప్పేసినయి మధ్యాహ్నపు సూర్యుడు చెట్ల మాటు నుండి చొచ్చుకొచ్చిన కిరణాలతో మామీద దాడి చేస్తున్నాడు. పోను పోను రోడ్డు కడ్డుగా కర్రిలు దుంగలు నీటికి కొట్టుకొచ్చినయి నిల్చి జీబును ముందుకు సాగ నియ్యలేదు.

"ఏమయ్యా పటేల్! రూటు బాగు చేయించని చెప్తే చేయించనేలేదు" రూటు ఆఫీసరు పక్కనకూచున్న పటేలు నుద్దేశించి అన్నాడు.

"చెప్పానుసారు గాడ్దికొడుకు చెయ్యనట్టుంది" అంటు ముందుకు కదిలి తోవ కష్టంగా ఉన్న చిన్న దుంగను జరిపాడు.

అలా తోవకడ్డంగా వున్న కర్రలను ఏరేస్తూ మరికొంత దూరం సాగినం. ఇదంతా మొత్తానికైతే మంచి థ్రిల్లింగ్‌గా ఉత్సాహంగా ఉంది. నా మిత్రుడు మధు మాత్రం తన దురదృష్టాన్ని (ఈ రూట్లో పడ్డందుకు) తిట్టుకుంటూ నడుస్తున్నాడు.

మరో గంట సాగింది ప్రయాణం.

"అదిగో ఊరు సమీపించింది. ఆ కనిపించే బోడు దాటితే ఊరు వచ్చినట్టే" మా రూటు గైడ్ ఆవూరి పటేల్ అయిన లక్ష్మయ్య అన్నాడు.

ఊరు అయితే కన్పించలేదు కాని జీబు వంపులోకి దిగటం ఎండిపోయిన రొడ్డి వాగు ఒకటి దాటేందుకు మరోసారి దిగటం- 4 వీల్స్‌లో జీబు వాగు దాటడం జర్గింది మరోసారి అయితే ఇరువైపుల పెరిగిన పెద్ద పెద్ద వృక్షాల మధ్య మెలికలు తిరుగుతూ సాగే వాగును చూస్తే ఆనందాన్నిచ్చేది. కాని కడుపులో సుర సుర ఆకలి మండిపోతుంటే ఆ ఆనందాన్ని ఆస్వాదించే ఓపిక ఎవరికి లేదు.

అడివిలో ఆ వూరు చేరుకునేవరకు కూడా ఊరు చేరినట్టుగా అన్పించలేదు ఊరు అంటే నాకు అంతకు ముందున్న అభిప్రాయం తారుమారైంది. సరిగ్గా వేళ్ళ మీద లెక్కపెట్టగలిగిన పది గుడిసెలున్నాయి. అంత అడివిలో కూడా ఇంటిమీది పైకప్పులు సరిగా లేకపోవటం నాకు ఆశ్చర్యం కల్గించింది. ఆ పది గుడిసెలను ఆనుకొని కర్రలతో కంపతో నాటిన ఎనుగు, వాటినానుకొని వేసిన వంజన్న సువ్వ సేను కలిపివేసి ఉంది. ఆ సేనును ఆనుకొని మళ్ళీ అడివి మొత్తంగా ఒక కిలో మీటరు పరిధిలో అడివి మధ్యగా ఉందా ఊరు. అసలది ఊరు కాదు గూడెం అంటా రని తర్వాత తెల్సింది.

మా జీబు సప్పుడు విని పిల్లలు, ఆడవాళ్లు ముసలివాళ్ళు గుడిసెలనుండి తలలు బయటికిపెట్టి భయం భయంగా చూస్తుండిపోయారు. పిల్లలు కొందరు మేపుతున్న పశువుల మందను అడివిలనుంచి మైదానంలోకి మళ్ళిస్తున్నారు కంగారుగా.

జీబువచ్చి ఫారెస్టు గెస్టుహౌజ్ (అదే మా పోలింగ్ బూత్ కూడా) ముందాగింది. మొదట్లో గెస్టుఅవుజంటే అదేదో పెద్ద భవంతి అని భావించాను కాని నా ఊహ తప్పయింది. ఆ గుడిసెల మధ్య తలుపులు కిటికీలు సరిగాలేని రెండు గదుల పెంకుటిల్లు. దానివెనుక చిన్న వంటశాల, స్నానాలగది ఉంది. చాలరోజులుగా అక్కడెవరు నివసించటం లేదనటానికి నిదర్శనంగా ఆ ఇంటిచుట్టు నడుముల మంటికి పెరిగిన గడ్డితుప్పలున్నాయి. గబ్బిలాల వాసన గదులనిండా వ్యాపించిఉంది. గెస్టుహౌజ్ నానుకొనివున్న విశాలమైన వేపచెట్టు. ఎప్పుడో గెస్టుహవుజ్ కొత్తగా కట్టినప్పుడు పెట్టిన నిమ్మచెట్టు కల్సి అక్కడ చల్లదనాన్ని ఇస్తుంది.

మా జీబు ఆగిన చోటికి రుమాలు చుట్టుకున్న తెల్లటి బుర్రమీసాల ముసలతను అతని ప్రక్కన లావుపాటి చేతివేళ్లున్న యువకుడు, పచ్చ బనీను వేసుకొన్నాడు మరో కతను నల్లటి చిప్పరెంటుకలు కల్గిన నాలుగేండ్ల అమ్మాయిని సంకలేసుకొనివచ్చిండు.

"తిందికేమన్నా ఇంతజామ్ చేస్తివా ఎంకులు" పటేల్ లక్ష్మయ్య అడిగిండు.

"బాంచెను నిన్న మీరు చెప్పినట్టు నల్గురు మనుసులను ఇవ్వాల ఉండమని చెప్పిన. మీకోసం చూస్తు వాళ్ళివ్వాల పనులకు పోలేదు"

"వీళ్ళిద్దరే ఉన్నారు ఇంకిద్దరేరి" ముసలాయెన వెనుకున్న వాళ్ళనుచూస్తు పటేల్.

"రే టూన్మంతు పోషాలు లచ్చిగాన్ని తీస్కరాపో" అన్నాడు బదులుగా.

పచ్చ బనీను యువకుడు మారు మాట్లాడకుండా అక్కడినుండి కదిలిపోయిండు.

"పొద్దటినుండి ఎవ్వరు ఏమితినలేదు నీళ్ళో నిప్పులో తెచ్చి వంట చెయిండ్లి తొందరగా" పురమాయించిండు పటేలు,

"అయ్యా మీరు తెచ్చిన సరుకులు చూయిస్తే మొదలుపెడ్తం" అమ్మాయిని ఎత్తుకున్నతను అన్నాడు. అతని పేరు చంద్రియ్య. "అగ్గో అదేమూట" అంటూ మావెంట తెచ్చుకున్న బియ్యం, పప్పులుప్పులు ఉన్నమూట చూయించాడు.

చంద్రియ్య ఆ మూటను లాక్కొని గెస్టుహవుజ్ వెనుకనున్న వంట గదికేసి నడిచిండు.

అంతలోకే మా ఎలక్షన్ ఆఫీసరు తెచ్చిన సామాను సర్దుకోవటం గురించి పోలింగ్ బూత్ ఎటువైపు పెడ్తే బాగుంటుందో ఆలోచిస్తు అన్నీ సరిగా ఉన్నాయో లేదో లెక్క చూసుకుంటు రేపటికోసం అన్ని ఏర్పాట్లు సరిగా చూసుకునేందుకు సిద్ధమైండు.

నిజం చెప్పాలంటే నూదెంతో ఉన్న పోలింగ్ బూత్, ఎగాపూర్ గోవిందరి ఎస్లాపూర్ మూడూళ్ళు కల్పితే '220' మంది వోటర్లున్నారు. నేను నా మిత్రుడేమి పనిచేయకుండా మాకోసం వేసిన నులక మంచంలో కూచున్నాము.

"అబ్బా ఈ అడివిలో కూడా ఎలక్షన్ల కోసం బూత్‌లు పెట్టారంటే నిజంగా మనదేరా ప్రజాస్వామ్యం" అన్నాడు మధు.

నేనేమి బదులు పలుకలేదు.

అప్పటివరకు కాస్త విశ్రాంతికోసం కూచున్న రూటు ఆఫీసరు సిగిరెట్టు కాలుస్తూ ఎస్కార్టుగా వచ్చిన జమేదార్ మరో ఇద్దరు జవాన్లచూసి "మనమింకా పెద్దామా" అన్నాడు.

"ఒక్క నిముషం ఆగండి సార్ మీకోసం చాయ్ ఏర్పాటు చేసాను చాయ్ తాగిపోదురుకాని అంటు పటేల్ లక్ష్మయ్య వారించిండు.

అదేదో తొందరగా కానియ్" అన్నాడు రూటు ఆఫీసరు. నీళ్ళకు పోతున్న "హన్మంతును పిల్చి" లచ్చుమ్మను తొందరగా చాయ్ తెమ్మను అన్నాడు.

పోలింగ్ బూత్‌కు ఎస్కార్టుగా వున్న రిజర్వ్ జమేదార్‌తో ఏదో మాట్లాడుతున్నాడు "మీరు అప్రమత్తంగా ఉండండి ఎప్పుడు లోడుచేసే ఉండాలి. మీకు చెప్పాల్సింది కాదనుకో కాకుంటే ఇక్కడ పరిస్థితేమి బాగాలేదు.

"మా బ్రతుకులన్నీ అడివిలనె గడుస్తాయి మేము చూసుకుంటాములెండి" రిజర్వ్ జమేదారు బదులు పలికిండు.

అంతలోకె లచ్చుమ్మ కేట్లీలో నల్లటి డికాషన్ లాంటి చాయ్ తెచ్చింది ముడుతలు పడ్డ మొఖము, ఎప్పుడు పొగాకు నమలటం వలన గారపట్టిన పండ్లతో తొడుక్కున్న బట్టలు ఏ రంగైంది తెలవటం లేదు. దూరం నుంచే పటేల్‌ను చూసి "దండాలు బాంచెను" అంది.

"ఏం లచ్చమ్మా బాగేనా" బదులు పలికిండు పటేల్.

"ఏంబాగు బాంచెను సావకుంట బతుకుతానం. గిప్పుడు పరే ఇంకా రెన్నెల్లు పోతే తాగేందుకు నీళ్లకూడా దొరకయి." చాయను గిలాసల్లో పంపుతూ అంది.

పటేలు చాయ్‌గిలాసలు అందుకొని ఒకటి రూట్ ఆఫీసరుకు మరొకటి పోలీసు జమేదారు కిచ్చింగు.

"సీళ్ళకు బాయి వుందికదా" అన్నాను ఉండబట్టలేక.

"ఇవ్వుడే కపికెడు కపికెడు తోడుకుంటానం ఎండకాలమైతే ఎండిపోతది ఇక వానకాలమైతే గంగదాటనియ్యదు"

"మరి బతికెట్లా"

"అగ్గో గుడిసెలచుట్టు జొన్న చేను వేసుకొన్నం అవే ఏమన్నా మిగిల్తె అదే తింటం."

"అడివి జంతువులు పంటలు నాశనం చెయ్యవా" అన్నాను మళ్ళి.

"చేస్తయి, జంతువులురాకుండా కంచెవేసో కాపుందో పంటను కాపాడుకోవచ్చు కాని బాకీలున్న షావుకార్లు ఊకుంటరా" ఇంకాఏదో చెపుతుందనుకున్నాను భారంగా నిట్టూర్చింది పటేల్ కేసి చూస్తూంది. ఆ వెంటనే ఖాళీ అయిన గిలాసలు తీసుకొని కడిగి మరో రెండు గ్లాసులు నింపి పటేల్‌కు ఇవ్వబోయింది. 'ముందా జవానకు ఇయ్యి వాళ్ళు ఎల్లిపోవాలి' అంటూ రూటు ఆఫీసర్‌కు ఎస్కార్టుగావచ్చిన జవాన్లను సూయించిండు.

పటేలు ఉండి ఉండి 'లచ్చమ్మా నీ నల్గురు కొడుకులు ఇక్కడ ఉన్నారా. అడిగిండు.

ముసల్దాని మొఖంలో విచార చాయలు కమ్ముకయి; 'ఎక్కడిది బాంచెను పెద్దోడున్న మూడోడు గంగదాటి ఎల్లిండు. ముందటేడు రెండోవాన్ని గుడ్డేలుగుకొట్టింది' ఇగిప్పుడు చిన్నోడు నేనే ఉంటానము.'

"ఊరిడిచిపోయినోల్లేమన్నా సంపాయించిండ్లా? నువ్వుకూడా వాళ్ళతోనే పోక పోయినావా?" పటేలు అడిగిండు.

"ఎక్కడికి పోయినా ఏమున్నది బాంచెను. గీరెక్కలున్నంత కాలమేబ్రతుకు ఈరెక్కలు లేకుంటే బ్రతుకెక్కడలేదు. ఊరిడిచి ఊట్నూర్లకుపోయిన నా యిద్దరు కొడుకులు ఏం సంపాయించిండ్లు కాంటాక్టరు దగ్గరోడు పనిలున్నడు. చేసినన్ని రోజులు తింటాండ్లు పనిలేనినాడు ఇక్కడిలాగె అక్కడ పస్తులు పంటాండ్లు.

లచ్చమ్మ మాటల మధ్యనే రూటు ఆఫీసరు లేసి 'మేం బయలుదేరుతాం. ఏమండి మాస్టరుగారు అన్ని ఏర్పాట్లు సరిగా ఉన్నట్టేకదా మమ్మల్నింకా సెలవు తీసుకోమంటారా' అంటు మా ప్రిసైడింగ్ ఆఫీసర్ను అడిగిండు.

అంతవరకు లెక్కలు సరిగా చూసుకున్న మా ప్రిసైడింగ్ ఆఫీసరు "మంచిదండి మళ్ళీ రేపు ఐదు గంటల వరకు వస్తారుకదా!" అన్నాడు.

"అంతవరకేం చేస్తామండి అంతకంటే ముందే వస్తాం వీలైనంత తొందరగా ఇక్కడినుండి బయలుదేరాలండీ" అంటూ "మీకు ఇంకేమన్నా అవసరమైతే ఇగో పటేలున్నడు వార్ని అడగండి" అంటు వెళ్ళి జీబులో కూచున్నాడు.

జీబు బురుబురులాడుతూ తిరుగు ప్రయాణం మొదలుపెట్టింది. జీబు పోయిన దిక్కే పిన్నలు పెద్దలంతా భయం భయంగా చూస్తుండగానే చెట్లమాటుకు కనుమరుగైంది.

"ఏంటీ వీళ్ళు జీబుకేసి వింతగా అలా చూస్తున్నారేంటీ" నా పక్కనే కూచున్న పటేల్ నా మాటలు వినిపించుకొని వినిపించుకోనట్టే ఎటో చూస్తుండిపోయాడు. అంతవరకు నిర్లిప్తంగా నిలుచున్న తెల్లటి గుబురు మీసాల, నెత్తికి రూమాలు పేల్క చుట్టుకున్న ముసలతను నా ప్రశ్నకు బదులుగా అదే నిర్లిప్తతతో కూడిన చూపులతో ఇలా అన్నాడు.

"మా వూరికి జీపులు ఎందుకస్తయిసార్ ఏదైనా జీపువస్తే ఫారెస్టు వారిదో, లేకుంటె షికారుకోసం వచ్చెటోల్లదో. పోయిన ఎలక్షన్ అప్పటినుండి ఎలక్షను జీబులొస్తున్నాయి" అన్నాడు యదాలాపంగా.

"అయితే తాత నీవు ఎన్నిసార్లు ఓట్లేసినావు" మళ్ళి అడిగాను.

"పోయిన ఎలక్షనప్పుడు ఒక్కసారి, కడెం నారాయణదొర నిలుసున్నప్పుడు గిట్లనే గీ పటేల్‌దొర వచ్చి రేపు ఓట్లున్నయి బిడ్డా పేరంతా వచ్చి వెయ్యాలని.

మముల్నందర్ని తోలుకొని 'ఇటికాల'కు తీస్కపోయి అదేదో చెయ్యి గుర్తుమీద ఒత్తే యించిండు. గట్లా ఏదన్నా పనిలేకుంటే దొరలు ఎందుకొస్తరు బాంచెను" అన్నాడు.

ఆ మాటలకు పటేల్ మొఖంల ఎందుకో విసుగు తాండవించింది.

ఆ గుడిసెల నానుకొని చిన్న పెంకుటిల్లుంది.

"అది ఎవరిదండీ" మళ్ళీ అడిగాను ముసలతన్ని అతను ఎందుకో చాల శాంతంగా బదులు పలికిండు.

"ఫారెస్టు గార్డుది మొన్నటిదాకా ఇక్కడే ఉండెటోడు. ఈమధ్య ఇక్కడ ఉంటలేడు 'పెంబి'ల ఉంటాండు. ఎప్పుడన్నా నెలకోసారి వచ్చిపోతడు."

"అదేమిటి"

"వాళ్ళిష్టం ఎవరు అడుగుతరు నెల తిరిగేసరికి జీతమొస్తే సరి"

ఆ మాటలకు మా ప్రిసైడింగ్ ఆఫీసరు అంతవరదాక ఎలక్షన్ సామాను లెక్కలు చూసుకుంటున్నవాడల్లా, ఒక్కసారి తలెత్తి జారిపోయిన కళ్ళద్దాలు సరిచేసుకుంటు ముసలతనికేసి చూసి "బాగా అనుభవజ్ఞుడే" అన్నాడు ఎందుకో? బహుశా అతని మాటలు ఆయన్ని ఆకర్షించినట్టుంది.

మంచంలో కూచున్న పటేలు అకారణంగా నవ్వి "మనమున్నది నాయకపోల్ల గూడెం. వీళ్ళకు కాస్త బయటి ప్రపంచంతోని అంతో ఇంతో సంబంధం మొదటి నుంచి ఉంది. ఇంకా అడివిలోకిపోతే గోండులు, కోలాములు, మచ్చలీర్లు, పచ్చ బొట్లోల్లుంటరు. వాళ్ల వీళ్ళంతా తెలివిమీరినోళ్ళు కాదు. వీళ్ళు కుడిచెయ్యిఅలాంటి వాళ్ళయితే వాళ్ల ఎడమచెయ్యి పంటోల్లు" అన్నాడు.

దాంతో ముసలతను మళ్ళీ ఇలా అన్నాడు "అంత అడివిల అడివి జంతువుల తీర్గ బ్రతికేటోళ్ళం. మాదాంట్ల మాకు తేడాలేమున్నయి బాంచెను"

పటేలు మళ్ళి అందుకొని "అట్లా అంటాండ్లుగాని వీళ్ల ఒకప్పుడు బాగా బ్రతికినోల్లె నా ఎరుకల మీరు కూపులు గుత్తకు తీసుకున్నప్పుడు ఎవడన్నా మా మాట వినేదా? నాల్గుపైసలు చేతుల ఆడెసరికి మా అంతటోడు లేడనిరి?

"ఆ రోజులు తలుచుకుంటే ఇప్పుడు మళ్ళీ వస్తాయా బాంచెన్" అన్నాడు ముసలతను.

ప్రిసైడింగ్ ఆఫీసర్ను ఉద్దేశించి పటేల్ మళ్ళీ ఇలాచెప్పసాగిండు "అప్పట్లో అడివిని గుత్తకు తీసుకున్న కంటాక్టర్లు, నరికిన కలపను తీస్కపోయేందుకు అప్పట్లో ఇప్పటిలెక్క లారీలు లేకుండె. అసలింతకు అడివిలకు మనిషి ఒంటరిగా వచ్చేవాడు కాదంటే నమ్మ అప్పటి అడివిల ఇప్పుడు పైసమందం లేదు. ఈ మధ్య కాలంల ప్లాంటేషన్ చేసి ఇప్పుడిప్పుడు దీన్ని రిజర్వు ఫారెస్టుకింద చేసిండ్లు కాబట్టి మనకు ఈమాత్రం కనిపిస్తాంది. ఆటువంటి రోజుల్లో నరికిన కలపను బయిటికి తీస్కపోయేందుకు ఈ నాయకపోల్లు బండ్లు కట్టి తీస్కపోయి 'పెంబి'లో కంటాక్టరుకు అప్పచెప్పెటోల్లు. అప్పట్లో ఈయనకు పదహారుబండ్లుండేయి. నెలకు ఎంతలేదన్నా నాల్గు ఐదువందలు సంపాదించెటోడు. ఎప్పుడైతె అడివిలకు దారులు ఏర్పడి లారీలు వచ్చుడు మొదలయిందో అప్పుడిక వీళ్ళపని పన్నది. ఆ తర్వాత కాలం అప్పుడు సంపాదించుకున్నవి తిని కూసున్నరు" అని.

నాయకపు ముసలతను అవునన్నట్టుగా తలూపిండు.

పని ముగించుకొని చేతులు దులుపుకుంటు ప్రిసైడింగ్ ఆఫీసర్ వచ్చి మంచంలో కూచుని "బాగా అలిసి పోయామండి రాత్రి సరిగా నిద్దురలేదు స్నానంచేస్తే కాస్త హుషారుగా ఉంటుందేమో" అన్నాడు పటేల్ నుద్దేశించి.

"దాందేముంది చెయ్యండి" అంటూ "అరె ఎంకులు! సార్లు స్నానం చేస్తరట ఇంకో పొయ్యిపెట్టి నీళ్ల కాగబెట్టు" అంటు పురమాయించాడు పటేల్.

పచ్చ బనీను వేసుకున్న ఎంకులు అనే ఆ యువకుడు తన అమాయకమైన ఎర్రటి మచ్చల మొఖాన్ని అటు ఇటు ఆడించి కుండ పట్టుకొని నీళ్ళకు పోయిండు ఆతర్వాత రాళ్ళు పేర్చి చిన్న చిన్న పుల్లలను, దుంగలను తెచ్చి మంటేసిండు. మరి కొద్దిసేపట్లో సల సల మరుగుతున్న పొయ్యిమీది నీళ్ళకుండను వట్టి చేతులతోనే దింపి నీళ్ల తోడిండు.

నాకు ఆశ్చర్యమేసింది అలా వట్టి చేతులతోనే అంత మరుగుతున్న నీళ్ళ కుండను ఎలా దింపి. పట్టుకపోయాడని. అతని లావాటి కాయలు కాసిన మొద్దు చేతులకేసి చూసాను. అతను యధాలాపంగా మరో నీళ్ళ కుండను పొయ్యి మీదికి ఎక్కిస్తున్నాడు. మనిషి చూడటానికి పెద్ద బలవంతుడుగా కనిపించకున్నా, అడ్డం

ఒడ్డంగా పగిలిన కండల్లో ఏదో అద్భుతమైన శక్తి ఉందనిపించింది. మట్టికొట్టుకు పోయిన పాదాలు చలికి పగిలిపోయి వున్నాయి.

పటేలు మరో ఇద్దర్ని ఆ గూడెం నుండి పిలిపించి వంట ఏర్పాటు చేయించాడు. మేము ఇక్కడికి వచ్చేటప్పుడు కడెం ప్రాజెక్టుకాడనుంచి తెచ్చుకొన్న పెద్ద జెల్ల చేపను కడిగి పులుసు కాచారు. మాతో వచ్చిన హిందీ పండితుడు శాకాహారి కావటం వల్ల అతనికోసం ప్రత్యేకంగా పప్పుకూడా చేశారు. ముందు జాగ్రత్తకోసం పటేలు వంటసామాన్లతోని మొదలుకొని అన్ని జీబులో వేయించి తీసుకురావటం వల్ల మొత్తానికైతే వంట బాగానే ఉందనిపించింది. లేకుంటే నిన్నటి నుండి సరిగా భోజనం చేయక పోవటంవల్లనోగాని అందరు సుష్టుగా చేపముక్క నంజుకుంటు గంజులు కాళీచేసేసరికి నాలుగుంపావు అయింది.

అప్పటికే పశ్చిమాన వంగిన సూర్యుడి కిరణాలు నిలువుగా ఆకాశంకంటూ పెరిగిన చెట్లకొసల చాటున దోబూచులాడుతున్నాయి అంతవరదాకా చెట్లమాటున మాటుగావీచ చలి మెల్లమెల్లగా మా మీద దాడికి సిద్ధమైంది.

"ఇంక కొద్ది రోజుల్లో సంక్రాంతి పండుగ అందుకే చలి నంకలు లేప నిస్త లేదు" అన్నాడు హిందీ పండితుడు.

"రాత్రికి ఇంకా చలి బాగుంటుందేమో" అన్నాడు మధు కాస్త ఎండ పడుతున్నకాడ నిలుచుని. పండ్లల్లో చిక్కిన ఆహారపు తునకల్ని సన్నటి పుల్లతో బయిటికి లాక్కుంటు.

పటేల్ "రాత్రికి మంట వేసుకుందాం అడివిల ఎండుకర్రలకు కొదువా" అన్నాడు వెంటనే అక్కడ నిలుచున్నతనిని పిల్చి మంట ఏర్పాటు చేయించిండు.

పెద్ద పెద్ద దుంగలను తెచ్చి ఒకవైపు పేర్చి సన్నటి పుల్లలతో మంటేసిండ్లు. మంట రగులుకుంటుంది. మెల్లమెల్లగా మేమందరం మంటచుట్టు గుమికూడాం.

మాకు ఎస్కార్టుగా ఉన్న రిజర్వు జమేదారు కాస్త ముందుకు జగ్గి కాలుతున్న దుంగమీద కూచున్నాడు. అతనికి వెచ్చగా మంట తగిలేందుకు అంతవరకు అక్కడ కూచున్న రిజర్వ్ కానిస్టేబుల్ గౌరవసూచకంగా కాస్త జరిగి కూచున్నడు. సెంట్రి డ్యూటిలో ఉన్న మరో కానిస్టేబుల్ తుపాకి నేలకానిస్తూ వేపచెట్టు నీడన నిల్చున్నడు.

మంట పెద్దది గావటంతో అందరం కాస్త జరిగి కూచున్నాం. ఒకవైపు పటేలు అతనిపక్కన నాయకపు మునలతను అతని పక్కన ఇంతవరదాక వంటచేసిన ఇద్దరు పచ్చబనీను ఎంకులు ఆ తర్వాత మేము కూచున్నాం.

తూర్పున సూర్యుడు చెట్లమాటునుండి పైకి వచ్చిండు. వెచ్చటి ఎండపొడ హాయినిస్తుంది. ఆ లేత ఎండకు చలి చెట్లనీడకు పరిగెత్తింది. ఇంకా ఈదురుగాలి చల్లగానన్నగా వీస్తూంది. లేత ఎండలో గూడెం స్నానమాడుతూంది. ఎవరో ముసల్ది ఓ గుడిసెముందు ఒడలిపోయి ముడుతలు పడ్డ శరీరంతో నిర్లిప్తంగా ఎటో చూస్తూంది. మేకలను, పశువులను తోలుకుంటు పశువులు కాసే పిల్లవాడొకడు అడివిలోకి ప్రియాణమైండు గూడెంలో నిశ్శబ్దంగా జన సంచారం లేకుండా ఉంది.

పోలింగ్ బూత్‌లో మాపని డిస్ట్రిబ్యూషన్ చేపిండు ప్రిసైడింగ్ ఆఫీసరు. వోటు వేయడానికి వచ్చినవారికి బ్యాలెట్‌ను ఎలా మలిచి పెట్టెలో వేయాల్సింది వివ రించే పని నేను తీసుకున్నాను. ఆ కొత్తపని చేయటానికి ఉత్సాహంగానే ఉంది. కాని తొమ్మిదైనా ఓటు వేయటానికి ఒక్కరు రాలేదు

ఓటర్స్‌కోసం మేం మా స్థానాలల్లో కూచొని చూస్తుండిపోయాం ఆ నిరీక్ష ణలో మరో అరగంట గడిచింది. ఓపిక నశించిపోయింది. మా హిందీ పండితుడు ప్రిసైడింగ్ ఆఫీసర్ను ఉద్దేశించి ఇలా అన్నాడు.

"పది కావొచ్చింది ఓటువేయటానికి ఒక్కరు రారేమిటి అసలింతకు ఇవాళ వోట్లు పోలయితయా లేదా?" అన్నాడు. అతనికి ఈ అడివినుంచి ఎంత తొంద రగా పని ముగించుకొని పోతే అంత బాగుండును అన్నట్లుగా ఉంది.

"అదే నాకు అర్థంకావటంలేదు" అంటు లేచి అతను బయటికి నడిచాడు. బయట ఎండలో మంచంమీద పటేల్ జమేదారు కూచొని ఉన్నాడు

"ఓట్లెయ్యటానికి ఎవరు రారేమిటి అసలింతకు ఇవ్వాళ ఓట్లు ఉన్నాయన్న సంగతి వీళ్ళకు తెలియనట్టుందే".

పటేల్ సమాధానంగా "అన్నివూళ్ళలో చెప్పి ఉంచాము. ఒకొక్కరు ఐదారు మైళ్లు నడిచిరావాలె దారిలో ఉన్నారేమో"

"ఏమో నాకు అనుమానంగానే ఉంది. ఇటు కాంగ్రెసు నుంచి కాని అటు తెలుగుదేశం అభ్యర్థినుండి కాని ఒక్క పోలింగ్ ఏజెంట్ కూడా లేడు. చివరికి మిగిలింది మనమే. ఇదే సిటీలోగాని, ఏదన్నా పల్లెటూళ్లోగాని అయితే ఎంత హడా వుడిగా ఉండేదో" అన్నాడు ప్రిసైడింగ్ ఆఫీసరు.

"అదివేరు ఇదివేరు. ఈ అడివిలో పోలింగ్ బూత్ పెట్టడమే గొప్ప. నా ఎరుకల ఎప్పుడు ఇక్కడికి ఈ విధంగా వచ్చిందిలేదు" పటేల్ రెండు చేతులను దౌడలకు ఆనించుకొన్నాడు.

"అరేయ్ ఎంకులు గూడెంకుపోయి ఉన్నోళ్ళందరిని వోట్లెయ్యటానికి రమ్మని చెప్పు" అంటూ ముసలి ఎంకులును పురమాయించిండు.

అప్పటిదాక మోటుకాకు చుట్టమీద నిప్పుగల్ల వేసుకొని, అది పడిపోకుండా చుట్టను నిటారుగా పట్టుకొని పొగపీల్చుకొంటున్న ఎంకులు నిప్పుగల్లను కిందరాల్చి చుట్టకేసి చూసుకుంటూ "గీయాల్లదాక ఎవరుంటరు దొంచెను అంత అడివిలకు బం కకు పోయి వుంటరు" అన్నాడు. అక్కడినుండి కదలటానికి ఇష్టం లేనట్టుగా.

జమేదారు మంచంలోంచి లేచి చలితో మొద్దుబారిన కాళ్ళను కాపుకునేందుకు మంటలో చిటపటలాడుతున్న మొద్దుకాడికి వచ్చి నిలుచున్నడు.

సూర్యుడు నడి నెత్తి మీదికొచ్చిండు. అయినా వోటర్లు ఎవరు రాలేదు. ఏదైనా గాని ఎవరు వస్తారన్న నమ్మకం లేనట్టుంది ఖాళీ పెట్టెలతో తిర్గి వెళ్ళాల్సి ఉంటుం దేమో అనిపించింది.

అంతలోకె దూరంనుండి ఏదో వాహనము వస్తున్న చప్పుడు విన్పించింది. ఈ వేళప్పుడు ఎవరై వుంటారా అని ఆలోచన్లో పడిపోయాము.

చెట్లమాటునుండి జీబు కన్పించింది. అందరం అటువైపు చూసాం.

"నాల్గు అయితేగాని మమ్మల్ని తిర్గి తీసుకెళ్ళేందుకు రారనుకున్న కనివియెన్స్ అప్పుడే వస్తున్నట్టుందే"

పటేలు లేచి దృష్టిసారించి చూసి "పోలీసువాళ్ళ జీబు" అన్నాడు ఖచ్చితంగా.

"ఎందుకై ఉంటుందో?"

"బహుశా పిటోర్రిలింగ్ కావచ్చు" పటేల్.

జీబు మా బూత్‌కాడికొచ్చింది. పటేల్ లేచి పోలీసు జీబుకు ఎదురుపోయిండు. అందులోంచి దిగిన లావైన పోలీసాఫీసర్ను చూసి "నమస్తేసార్" అన్నాడు. అతను ప్రీతిగా చేతిలోని లాటిని ఆడించి నమస్కరించిండు.

ముందు దిగినతను సర్కిల్ ఇనస్పెక్టర్‌లాగున్నాడు. పెద్దతలకు మాంసపు ముద్దలు అద్దినట్టుగా చెంపలు వేలాడుతున్నాయి. ఇన్‌షర్ట్ చెమటవల్ల అతని లావాటి పొట్ట మరింత పొడుచుకొచ్చింది. సగంవరకు మడిచిన చేతులంగీ నుండి బాగా బలిసిన దండలు కనిపిస్తున్నాయి. చిన్నని కండ్లు మూసుకపోయినట్టుగా, ఇప్పుడే నిదుర నుండి లేచినట్టుగా మబ్బుగా ఉన్నాయి.

అతన్ని అనుసరించివచ్చిన సబ్ ఇన్స్పెక్టర్ ఎర్రగా అందమైనకోలమొఖంలా కొట్టొచ్చినట్టుగా నల్లటి మీసాలున్నాయి. అవి ఊకె తీరటంవల్లనేమో కొసలు వడి తిరిగున్నాయి. కనుకొనుకులనుండి చూసే ఆ చూపులు మాత్రం ఏదో దొంగతనం చేసి పట్టుబడిన దొంగచూపులుగా మాటిమాటికి చంచలంగా అటు ఇటు పరకాయించి చూస్తున్నాయి. వారివెంట జీబులో వెనుకవైపు నక్కి కూచున్న ఆరుగురు సాయుధ భటులు దిగి తుపాకులు పట్టుకొని జీబుకు వెనకవైపున నిలుచున్నారు.

ఉబ్బి చెంపలు కదలాడుతుంటే సర్కిల్ అధికార పూర్వకమైన బొంగురు గొంతుతో.

"పోలింగ్ ఎలా జరుగుతుంది. అంత సవ్యంగానే ఉందా?" అంటూ అడిగాడు.

"ఇంతపరదాక ఒక్కవోటు కూడా పోల్ కాలేదు" అంటూ మా ప్రిసైడింగ్ ఆఫీసరు బదులుపలికిండు.

సర్కిల్ అప్రియత్నంగా రొంటికున్న పిస్తల్ మీద చేతులేపి. ఎస్ఐ కేసి చూసితలాడించి.

"మాకెలవుడా....మనకొచ్చిన ఇన్‌ఫర్మేషనంత కరెక్టైనన్న మాట" అన్నడు.

ఎస్.ఐ. గౌరవం ఉట్టిపడేలా తలాడించిండు. అవునన్నట్టుగా.

సర్కిల్ పటేల్ వైపు తిర్గి కోపంతో మండుతున్న కండ్లతో. "ఏం పటేల్ ఈ లంజకొడుకులు వోట్లెయ్యటానికి ఎందుకు రాలేదు." "వోట్లున్నాయని గూడెంల చెప్పలేదా."

పటేల్ వెనకకు చేతులు కట్టుకొని "రెండు రోజుల ముందె వచ్చి వోట్లున్న అందరు వెయ్యాలని చెప్పినయ్యా కాని గాడ్ది కొడుకులు ఎందుకురాలేదో తెల్వదు."

"చెప్పినా రాలేదు! లంజకొడుకులకు గమండి పెర్గింది. నక్సలైట్ నా కొడుకులు అడివిల గూడెం పొంటితిర్గి వోట్లెయ్యొద్దని ప్రచారం చెస్తాందని మాకు కబురు వొచ్చింది. అందుకే రానట్టుంది. మాకెలవుడా గాండ్లు" అలా కోపంతో చిరుబురు లాడుతూనే చుట్టుచూసి మాకు కాస్త దూరంలో నిలుచున్న ముసలి ఎంకులు కెసి చూసి చేతిలోని కర్రి ఆడిస్తూ "అరె ముసలోడా ఇటురా లంజకొడుకా" అంటు అరిచాడు.

ముసలి ఎంకులు భయం భయంగా చూస్తూ కాస్తముందుకొచ్చి నిలుచున్నడు.

"నీదేగూడెంరా" లాటి ఆడిస్తూ సర్కిల్

"ఇదే గూడెం బాంచెను" చేతులు జోడించి

"గూడెపోళ్ళంతా వోట్లేసినారా?" కండ్లెర్రిచేసి

"గీ యాల్లప్పుడు ఎవరుంటరు బాంచెను అడివిల ఆకులు అలుములు ఏరు కొని బ్రతికెటోళ్లుపొద్దున్నే అడివికి పోయిండ్లు బాంచెను" ఆ ముసలతను ఇంకా అలా చేతులు జోడించే నిలబడ్డడు.

"అడివికి పోయిండ్లురా లంజాకొడుకా! నక్సలైట్ నాకొడుకులు గూడెంల కొచ్చి వోట్లెయ్యొద్దని ప్రచారం చేయలేదురా" కాస్త ముందుకు జర్గిండు లాటి ఆడించుకుంటూనే.

"గీ ఓట్ల సంగతి మాకేమెరుక బాంచెను"

"మీకు అన్ని ఎరుకేరా నక్సలైట్ నా కొడుకా" అంటు లాటితో విసురుగా ఒకటేసిండు.

ఈ హఠాత్ పరిణామానికి మేమంతా ఒక్క క్షణం ఖంగుతున్నాం. ముసలి ఎంకులు దెబ్బతాకిన రొంటిని చేత్తో తడుముకొని మరో దెబ్బ తాకుతుందో ఏమో

నన్న భయంతో క్రింద కూలబడి మళ్ళీ చేతులు జోడించి "కొట్టకు బాంచెను నీ ఉచ్చ తాగుతా నీకాల్మొక్తా నాకేమెరుక బాంచెను" అంటూ దీనంగా బ్రతిమిలాడసాగిండు.

సర్కిల్ మళ్ళీ పటేల్‌వైపు చూసి "గూడెంల ఎవరున్నరో పిల్వు ముసలి ముతక అందర్ని తోలుకొచ్చి వోట్లేయించండి ఎవరన్నా లంజాకొడుకు రాకుంటే మాకు చెప్పండి"

పటేల్ తలాడించి "అరేయ్ చంద్రియ్య హన్మంతు" అంటూ అంతవరదాక మాకోసం వంట చేస్తున్నవారిని కేకేసిండు.

వాళ్ళు అక్కడినుండే చేతులు కట్టుకొని గజగజ వణుక్కుంటూ మా దగ్గరికి వచ్చిండ్లు,

సర్కిల్ వాళ్ళ వైపు చూసి, వాళ్ళు దగ్గరికి రాగానే "ఈ లంజ కొడుకులు వోట్లేసిండ్లా" అన్నాడు.

"ఎక్కడిది బాంచెను. పటేలు గా వంటలు చేయమంటే చేస్తానం" అన్నాడు చంద్రియ్యనడుం వరకు వంగి సలాంచేస్తూ.

"ముందు ఈ లంజ కొడుకులతోని వోట్లెయించండి" సర్కిల్ ప్రిసైడింగ్ అఫీసర్ను ఉద్దేశించి అన్నాడు.

ప్రిసైడింగ్ అఫీసరు గబ గబా పోలింగ్ బూతుకాడికొచ్చి వొటర్స్ లిస్టు చూసివాళ్ళపేర్లు అడిగి. తలఅడ్డంగా అడిస్తూ. "లిస్టులో వీళ్ళపేర్లు లేవు" అన్నాడు.

"అదే ఎందుకు లేవు" సర్కిల్ ప్రిసైడింగ్ అఫీసర్ను అడిగి మళ్ళీ వాళ్ళ వైపుతిర్గి" లంజ కొడుకుల్లారా లీష్టుల మీ పేరెందుకు ఎక్కించుకోలెదురా" అన్నాడు గుర్రిగా.

"మాకెమెరుక బాంచెను" ఇద్దరు ఒక్కసారే బదులిచ్చిండ్లు.

"వాళ్ళ పేర్లు లేకుంటమాయే ఎవరో ఇద్దరి పేర్లమీద ముందా లంజ కొడుకులతోని వోట్లెయించండ్లి లేకుంటే మాకు ఇబ్బంది వస్తది."

ప్రిసైడింగ్ అఫీసరు "అది ఎట్లా జర్గుతుందిసార్" అన్నాడు అభ్యంతరం పెడ్తూ.

సర్కిల్ చిరాగ్గా చూస్తూ. "నీ రూల్స్ ఎవడికి కావాలయ్యా. ఏ లంజ కొడుకు నెగ్గితే మనకేంది మాకు ఈ బూత్‌ల వోట్లు పడలేదు. ఎన్నికలు బైకాట్ చేసిండ్లంటే, మేమేం చేస్తానమని పై నించి లకోటా వస్తది. ఎవని పేరు ఏదనో వాళ్ళతోని వోట్లేయించండ్లి. అ లంజ కొడుకులు ఎవనికేసినా పర్వలేదు కాని బూత్‌ల మాత్రిం వోట్లు పడాలి" అన్నాడు కోపంగా

మా ప్రిసైడింగ్ ఆఫీసరు ఏమనుకున్నాడో ఏమో గాని "సరే మీ ఇష్టం" అంటు తలాడించి, వాళ్ళతో వోట్లేయించిండు.

అలా మొదటిసారి బూత్‌లో నాల్గు ఓట్లు పడ్డయి. ఆ తర్వాత వాళ్ళిద్దర్ని వెంట పెట్టుకొని ఎస్ఐ మరిద్దరు కానిస్టేబుల్స్‌తో గూడెంలో తిర్గి, మరో నలుగురు స్త్రీలను ఒక్క ముసలతన్ని తోడుకొచ్చిండ్లు. స్త్రీలలో ఇద్దరు కాటికి కాళ్ళు చాపుకున్న స్త్రీలు. ఒక స్త్రీ బాలింతరాలు మరొక ముసల్ది ఇందాక వీళ్ళకు చాయ్ తయారు చేసి ఇచ్చిన లచ్చమ్మ. కండ్లు కనిపించని ముసలతన్ని కూడా తోడ్కొని వచ్చిండు.

అందరితోని ఓట్లేయించుడు అయిపోయింది అనిపించినంక పోలీసు జీబు పక్క గూడెంకు బయలుదేరింది.

బహుశా అక్కడకూడ ఇటువంటి బీభత్సమేదో జర్గి ఉంటుంది అనటానికి నిదర్శనంగా ఆ తర్వాత రెండు బ్యాచీలుగా వోటర్లు వచ్చారు.

దోమ్‌టరి నుంచి వచ్చిన మొదటి బ్యాచీలో ఆర్గురు స్త్రీలు ముగ్గురు పురుషులు వచ్చారు, వాళ్ళ పూర్తిగా గోండు తెగకు చెందినవారు. చప్పబడిపోయిన వెడల్పు ముఖాలు కలిగి ఉన్నారు. స్త్రీలు మెడకు చుట్టుకున్న గుడ్డను కొద్దిగాలాగి రొమ్ముల మీద అచ్ఛాదనగా కప్పుకున్నారు. పురుషులకు మెల్లమీద అచ్ఛాదనం తప్ప మరేమి లేదు. వాళ్ళను తోలుకొని వారి వెంట ఇద్దరు సాయుధ పోలీసులు కూడా వచ్చారు. వోట్లు వేయటానికి వచ్చినవారెవరు ఇదివరలో ఎప్పుడు ఓట్లు వేసినవారు కాదు వచ్చినవారెవరికి తెలుగురాదు. మాకెవరికి గోండు భాష రాదు. పటేల్ మాకు మధ్యవర్తిగా ఉండి వాళ్ళకేదో చెప్పాల్సిన నాల్గు మాటలు చెప్పివాళ్ళతోని ఓట్లు వేయించటం జర్గింది.

ఆ తర్వాత మరో గూడెం నుంచి మరికొంత మందిని పోలీసులు తోడ్కొని వచ్చారు.

మొత్తానికైతే, చివరికి 24 వోట్లు పోలయినాయి. ఇంకెవరు వోటర్లు వస్తారన్న నమ్మకం ఎవరికి లేదు. అయినా ఓటింగ్ ముగిసేవరకు అందరం వేచి ఉండాల్సిందే కదా!

అలాగే సమయం గడవటంకోసం నిరీక్షిస్తుండిపోయాము. ఎవరేమి మాట్లాడటం లేదు. ఒక విధమైన భయం, గంభీరత ఆవరించింది.

ఉండి ఉండి మా ప్రిసైడింగ్ ఆఫీసరు భారంగా నిట్టూర్చి "మొత్తానికైతే ఇదంతా గమ్మత్తుగా ఉంది" అన్నాడు.

పటేల్ నోరిప్పిండు "ఇదంతా డిస్టబ్ ఏరియా సార్ ఇదివరికోసారి గీ పక్క ఊల్లనే తాసీల్దారు శిస్తు వసూల్లప్పడు టూర్ మీద వచ్చినప్పుడు ఈ గోండోల్లందరు మమ్ముల్నందర్ని గెరావో చేసిండ్లు శిస్తులు మాపుచెయ్యాలని, మాకేమి చేసారని మీకు శిస్తులు కట్టాలని గెరావో చేసి నాల్గుగంటలసేపు సతాయించిండ్లు. అప్పటినుండి గీ గూడేలకు ఏ అధికారి రావాలన్నా ఉచ్చబడ్తదంటే నమ్మ" అంటూ ఎప్పుడో జర్గిన సంఘటన చెప్పుకొచ్చిండు.

ఆ తర్వాత అటువంటిదే మరో సంఘటన గురించి జమేదారు చెప్పుకొచ్చిండు.

సరిగ్గా మూడు గంటలకు మళ్ళీ మాకుజీబు సప్పుడైంది. ఈసారి వచ్చిందిమాత్రిం మా రూట్ ఆఫీసరు ఆయనకు ఎస్కార్ట్‌గా ఉన్న జమేదారు మరిద్దరు సాయుధభటులు ఆయన వస్తూరాగానే హడావుడి పడిపోతూ "ఏమైంది ఏమన్నా వోట్లుపోలయినాయా?" అంటూ అడగసాగిండు.

పటేలు జర్గిదంతా చెప్పుకొచ్చిండు. అతను గడ్డాన్ని బరబర గీక్కుంటు, మధ్య మధ్య అచ్చా ఐసా హోగయా. అంటూ పటేలుచెప్పింది. సాంతంగా విని....

"నాకు ముందె తెల్సు ఇటువంటిదేదో జర్గుతుందని" అని సిగరెట్టు ముట్టించు కొన్నాడు.

"క్యా సాబ్. మనంజల్దీ ఇక్కడ నుండి బయలుదేరితనే మంచిది" అన్నాడు ప్రిసైడింగ్ ఆఫీసరుతో

"అదెంటి సార్ నాల్గింటికి కదా మనం బూత్‌ను కట్టేసేది. ఎవరు వచ్చినా రాకున్నా నాల్గింటి వరకు ఉండాల్సిందేకదాని మేమింకా ఎకౌంట్సు క్లోజ్ చెయలే. సీలు అవి యివి ఇంకా చాల పనుంది ముగించటానికి." నసిగిండు ప్రిసైడింగ్ ఆఫీసరు.

"వోట్లు ఎవరు ఏస్తె మనకెందీ. వెయ్యకుంటె మనకెందయ్యా. పొద్దు కుంకక ముందే ముందు మనం బ్యాలెట్ బాక్స్‌లను తీసుకొని అడివిదాటాలి. ఏమన్నా అయితె ఎవరు బాధ్యులు. ముందా బ్యాలెట్ బాక్స్‌లకు సీల్లు వెయండ్లీ ఇంకేమున్నారాతపూత పనులుంటే అక్కతికి పోయినంక చూసుకోవచ్చు."

ఇంకాస్త అనుమాన పడుతున్న మా ప్రిసైడింగ్ ఆఫీసర్ను చూసి "మీకెం భయం లేదు. మీ పై అఫ్సర్‌గా నేను చెపుతున్నా కదా. తొందరగ తెమిల్చి ఇక్కడి నుండి బయలు దేరాలి."

చేసేదేమి లేక మేము మా పని ముగించాం. మరో పదిహేను నిముషా లకు తిర్గి జీబులో యిరుక్క పోయాం.

ఈ అడివిలో ఏదో భయంకరమైన పిశాచి దాగున్నట్టు. అది మమ్మల్ని కబలించటానికి మాపైకి వస్తున్నట్టు గబ గబ బుర్ బుర్ లాడుతు జీపు ముందుకు కదిలింది.

నా బుర్రలో అంతుపొంతులేని ఆలోచన. ప్రపంచంలో అతిపెద్ద ప్రజాస్వామిక దేశం.... ప్రజాభీష్టం.... ప్రజల కొరకు.... ప్రజలచేత.... ప్రజలచే.... అంతా అబద్ధం ఇదంతా బూటకం మోసం దగా పెద్దగా అరవాలనిపించింది.

నాపక్కలో ఏదో గుచ్చుకుంటుంది. చూస్తే ఏముంది.... నా పక్కనే మాకు ఎస్కార్టుగా వచ్చిన సాయుధ రిజర్వు పోలీసు తుపాకి కొననున్న బాయినెట్ బ్యాలెట్ పెట్టెలమీదుగా నా పక్కలో గుచ్చుకుంటుంది. బాయినెట్‌ను పట్టి కాస్త ముందుకు జరిపాను. అంతవరదాక కునుకిపాట్లు పడుతున్న జవాను ఒక్కసారి కళ్ళు తెరచి చూసి మళ్ళీ కళ్ళుమూసుకున్నాడు. బ్యాలెట్ బాక్స్‌మీద తుపాకి ఇంకా అలాగే ఉంది.

ఒక్కసారి మాకు అంతకంతకు దూరమవుతున్న ఎంగ్లాపూర్ గూడెం కేసి చూస్తుండిపోయాను. పడమటికి వంగిన సూర్యుని అరుణకాంతిలో ఆ గూడెం అంతకంతకు దూరమై చివరికి సూర్యునిలో కల్సిపోయింది.

మేము అడివి దాటేసరికి పశ్చిమాన సూర్యుని సంధ్యారుణ కాంతిలో అడివి మొత్తంగా అంటుకున్నట్టుగా ఉంది.

ప్రజాస్వామ్యాన్ని పొట్టలో పెట్టుకున్న మా జీబు అంతకంతకు అడివినుంచి పారిపోతుంది మైదానం వైపు.

---


Statement about ownership and other prticulars about

**SṚJANA**

**FORM IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | ... | Warangal |
| 2. Periodicity of its Publication | ... | Monthly |
| 3. Printer's Name | ... | P. Hemalatha |
| Whether citizen of India? | ... | Yes |
| Address | ... | SṚJANA<br>Hanamkonda 506 001 |
| 4. Publisher's Name | ... | P. Hemalatha |
| Whether citizen of India? | ... | Yes |
| Address | ... | (same as above) |
| 5. Editor's Name | ... | P. Hemalatha |
| Whether citizen of India? | ... | Yes |
| Address | ... | (same as above) |

I, P. Hemalatha hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/- *P. Hemalatha*
Publisher.

# విముక్తి ఉద్యమం - స్త్రీ
## ఒక అనుభవం

వసుంధర

"అణగారిన కార్మికవర్గం శైశవ దశలో తన కోపాన్నంతా యంత్రాలకు వ్యతిరేకంగా ప్రదర్శించింది, తర్వాత ఆ కార్మిక వర్గమే పారిస్ కమ్యూన్‌ను నిర్మించింది. ఈ రెండిటి మధ్య దూరం 'పురుషుడికి' వ్యతిరేకంగా తిరుగుబాటుకూ, స్త్రీ విముక్తికీ మధ్య ఇంకా గడపవలసిన దూరమే"

-క్లాడీ బ్రొయెల్

స్త్రీ సమస్యపై ఈ మధ్యకాలంలో తెలుగు విప్లవ సాహిత్యంలో చర్చ ప్రారంభమయి పెద్దఎత్తున కొనసాగుతున్నది. ఇలా చర్చ సాగడమే స్త్రీ సమస్యపై చాల ఆలోచనలూ దృక్పథాలూ సంఘర్షిస్తున్నాయనడానికి సూచన. ఇలా సంఘర్షించిన వేల ఆలోచనలే ఒక గొప్ప అవగాహనకు దారి తీస్తాయి.

ఇప్పటికీ సాగుతున్న చర్చనంతా మౌలికంగా మూడు అవగాహనా పునాదుల కింద విభజించవచ్చు. స్త్రీ సమస్య నూతన ప్రజాస్వామిక విప్లవ విజయంతోనో, సోషలిస్టు విప్లవ విజయంతోనో పరిష్కారమవుతుందనే సూత్రం చెప్పి ప్రస్తుతం స్త్రీ సమస్యను పట్టించుకోవలసిన అవసరాన్ని దాటవేయడం మొదటిది. సర్వ రంగాలనూ మూలాలనుంచి ప్రశ్నించి కూలదోయవలసినదాన్నంతా కూలదోసి, వినూత్న సమాజాన్ని నిర్మించవలసిన విప్లవం ఏ సమస్యనూ వాయిదా వేయజాలదనీ, సమన్వయం సాధించి అన్ని సమస్యలపై పోరాటాన్ని ఏకకాలంలో చేపట్టవలసిందేననీ, సోషలిస్టు విప్లవం తర్వాత కూడా స్త్రీ సమస్య వంటి సమస్యలపై పోరాటం తప్పదనీ భావించడం రెండవది. సోషలిస్టు సమాజాలుగా ఉండిన సమాజాలలో కూడా స్త్రీ సమస్య పరిష్కారం కాలేదు గనుక "ఉద్యమాలకు స్త్రీ సమస్య పట్ల సరైన అవగాహన లేదు" గనుక సోషలిస్టు విప్లవంతో సంబంధం లేకుండా స్త్రీలు తమంతట తాము పితృస్వామ్యానికీ పురుషాధిపత్యానికీ వ్యతిరేకంగా పోరాడాలనడం మూడవ అవగాహన. మూడవ అవగాహన

ఇవాళ బలహీనంగానే ఉన్నప్పటికీ అది ప్రమాదకరమైనది. ఖచ్చితంగా అది సమగ్ర సామాజిక విప్లవాన్ని విచ్ఛిన్నపరచేదే. విప్లవ కృషిని చీల్చడానికి, నిర్వీర్యం చెయ్యడానికి వస్తున్న ఈ వాదన దాని తర్కశక్తివల్ల, ప్రధానంగా అది ఉపయోగించుకుంటున్న సోషలిస్టు దేశాల మహిళా ఉద్యమానుభవాల లోపాలవల్ల కొద్దికొద్దిగా విప్లవ శ్రేణుల్లోకి ప్రవేశిస్తోంది.

ఐతే విచిత్రమైన విషయమేమంటే గత మూడు సంవత్సరాలుగా జరుగుతున్న ఈ చర్చలో దాదాపు అందరూ ఇంతవరకూ తమ తమ అవగాహనలను అనిర్దిష్టంగా సాధారణంగా ప్రకటించడం మినహా నిర్దిష్టంగా, ఖచ్చితంగా ప్రకటించలేదు. ఏడు దశాబ్దాల సోషలిస్టు సమాజాల అనుభవాల్ని దాదాపు అందరూ ఒకటి రెండు మాటల్లో ప్రస్తావించి తమ వాదనలను సమర్థించుకున్నారు గాని, ఎవరూ నిర్దిష్టంగా ఆ అనుభవాల్ని వివరించి చెప్పి తమ అవగాహనలకు ప్రాతిపదికను చూపలేదు. ఈ నేపథ్యంలో సోషలిస్టు దేశాల మహిళా ఉద్యమాల్ని పరిశీలించవలసిన అవసరం ఎంతో ఉంది.

ఈ ఆలోచనతో రష్యా, తూర్పు యూరప్ దేశాలు, చైనా, వియత్నాం, కంపూచియాల అనుభవాలు పరిశీలించవలసి ఉంది. ఆయా దేశాలలో పార్టీ, ప్రభుత్వం విప్లవకరంగా ఉన్నాయని ఒప్పుకునే వరకైనా ఈ పరిశోధన సాగాలి. ఐతే మన నిర్దిష్ట సాంఘిక పరిస్థితులకు తగిన పాఠాలను రష్యా, తూర్పు యూరప్ దేశాల అనుభవాల నుంచి రాబట్టడం సాధ్యం కాదు. యూరపియన్ సంస్కృతి పునాదిమీద ప్రారంభమై సోషలిస్టు సంస్కృతిని నిర్మించ తలపెట్టిన ఆయా దేశాల సమస్యల పరిశీలన కేవలం పండిత చర్చగానే ఉంటుంది. అది స్త్రీ సమస్య పట్ల సాధారణ మార్క్సిస్టు పరిజ్ఞానానికి పనికి రావచ్చుగాని భారతదేశం వంటి అర్థ వలస - అర్థ భూస్వామ్య దేశపు స్త్రీ సమస్యకు పరిష్కారాలు చూపజాలదు.

కనుక భారత సంస్కృతితో దాదాపు ఏకీభావం ఉండే చైనా అనుభవాన్ని పరిశీలించడం సముచితంగా ఉంటుంది. కొన్ని అంశాలలో భారత స్త్రీ కన్న ఎక్కువ నిర్బంధాన్ని, అణచివేతను, వివక్షతను అనుభవించిన చైనా స్త్రీ ఎలా లేచి నిలిచి విప్లవ క్రమంలో తన న్యాయమైన పాత్ర కోసం పోరాడిందో, ఎలా గెలుచుకుందో అర్థం చేసుకోవడం భారత మహిళా ఉద్యమానికి చాల అవసరం.

చైనా సమాజంలో స్త్రీ రాజకీయ, వంశ, మత అధికారాలతో పాటు పురుషాధికారం కింద (భర్త అధికారం కింద) నలిగి పోతున్నారని మావో 1927 లోనే అన్నాడు. మొదటి మూడు అధికారాలను పురుషుడు కూడ భరించవలసి వస్తోందని ఆయనే వివరించాడు. రాజకీయాధికారం, అది కొమిన్‌టాంగ్ పాలన అయినా, యుద్ధ ప్రభువుల పాలన అయినా భూస్వామ్యభావజాలాన్ని పెంచి పోషిస్తూ భూస్వామ్యాన్నే కాపాడింది. సమాజానికి మౌలిక యూనిట్ అయిన కుటుంబం స్థాయి నుంచే ఒక అంతస్తుల వ్యవస్థను ఏర్పరచకపోతే మొత్తం మీద అంతస్తుల వ్యవస్థ పునాదిగా ఉన్న సమాజం మనజాలదు. అందుకే పాతివ్రత్యం, పితృవాక్య పరిపాలన, అన్నగారి పాదుకలకు సేవ చేయడం వంటి సాంప్రదాయాలనే పేరు ఉండే నిర్బంధపూరితమైన సంబంధాలనే తప్ప కుటుంబంలో స్నేహ సంబంధాలనూ, సమానత్వాన్నీ ప్రవేశపెట్టడానికి రాజకీయ, మత, వంశాధికారాలు వ్యతిరేకంగా ఉంటాయి. అట్లా మౌలిక యూనిట్ అయిన కుటుంబంలో మళ్ళీ శ్రమ విభజన ఈ అంతస్తుల ఆధారంగానే జరుగుతుంది. ఉత్పాదక శ్రమను పురుషుడు తీసుకుంటాడు. అనుత్పాదకమైన ఇంటి పని వంటి శ్రమను స్త్రీ బాధ్యత చేస్తాడు. ఐతే ఈ పంపకానికి శ్రమ ఎక్కువ తక్కువలూ, కష్టసుఖాలూ, శక్తి బలహీనతలూ ప్రాతిపదిక కావు. ఏ పనికి సమాజం ప్రాముఖ్యం ఇస్తున్నది. ఏ పనిని సమాజం ఉన్నతమయినదిగా, గౌరవనీయమయినదిగా చూస్తున్నది అనేది మాత్రమే ప్రాతిపదిక.

చైనా సమాజంలో ఈ పంపకానికి మరొక అంశం చేరింది. చైనా స్త్రీలు ఐదేళ్ళ వయసులో తప్పనిసరిగా పాదాలు పెరగకుండా కట్లు కట్టించుకోవాలి. ఆ కారణాన యవ్వనంలోకీ మధ్యవయసులోకివచ్చిన స్త్రీలకు పాదాలు పొట్టిగా ఉండి నడవడానికీ పనికీ ఆటంకం కలిగిస్తాయి. ఆ స్త్రీలు వేగంగా నడవలేరు. బరువులు మోయడంలో పోటీపడలేరు. 'అందమైన పొట్టి పాదాలు' అనేపేరుతో భూస్వామ్యం ఈ అశక్తతనంతా స్త్రీలమీద రుద్దింది. అసలు ఈ పొట్టి పాదాల సాంప్రదాయం ఎందుకొచ్చిందో చర్చిస్తూ డెలియా డేవిన్ ఇది ఖచ్చితంగా స్త్రీలను ఆర్థికంగా అశక్తులను చేయడానికీ, తద్వారా అ స్వతంత్రులను చేయడానికీ కావచ్చునంటుంది.

బాల్యంనుంచే భౌతికంగా ఈ అశక్తతనూ, మానసికంగా, భావజాలపరంగా అబలత్వాన్నీ, అల్పత్వాన్నీ, అసమర్థతనూ రంగరింపజేసుకున్న స్త్రీకి ఆ తర్వాత

సాగే జీవితంలో కూడా స్వంత నిర్ణయాలేమీ ఉండవు. చదువు విషయానికొస్తే నాటి చైనా సమాజంలో పురుషులలో అక్షరాస్యతే చాల తక్కువ. ఇక స్త్రీల సంగతి చెప్పనక్కరలేదు. సామ్రాజ్యవాద ప్రభావంలోకి వచ్చిన షాంఘై వంటి నగరాలలోనో, చదువును ఒక అలంకారంగా భావించే ఉన్నత వర్గీయులలోనో తప్ప స్త్రీలకు చదువు లేనేలేదు. స్త్రీ విద్య అవసరమనీ, అది వాళ్ళ హక్కనీ గుర్తింపులేనేలేదు. పెళ్ళి విషయంలో చైనా సమాజంలో వర నిశ్చయాలు చాల ఎక్కువ. స్త్రీలకు అతి చిన్న వయసులోనే ఎవరో యువకుడినో, మధ్యవయస్కుడినో, వృద్ధుడినో భర్తగా నిశ్చయించేవారు. పెళ్ళినాటికి స్త్రీ యుక్తవయస్కురాలయితే భర్త నడీడులోనో ముసలితనంలోనో ఉండేవాడు. ఇక ఆ తర్వాత ఆ స్త్రీ భర్త అదుపాజ్ఞలలోనో మెట్టింటివారి అదుపాజ్ఞలలోనో ఉండవలసిందే. వీటికితోడు వ్యభిచారం, బహుభార్యాత్వం, ఉంచుకోవడం, స్త్రీ పురుష సంబంధాలలో భూస్వామ్య దౌర్జన్యం ప్రతిఫలించడం వంటి సమస్యలెన్నో ఉండనే ఉండేవి.

ఈ దుర్భర జీవితంలో చైనా స్త్రీకి ఒకే ఒక్క ప్రతిఘటనా రూపం ఆత్మహత్యే. మావో 1919లో తొలి రోజుల్లో రాసిన వ్యాసం ఒక గృహిణి ఆత్మహత్య గురించే. ఐతే స్త్రీ సమస్య గురించి భూస్వామ్య వ్యతిరేక, ప్రజాస్వామ్య, విప్లవకర ఆలోచనా సాంప్రదాయానికి కనీసం ఒకటిన్నర శతాబ్దాల చరిత్ర ఉంది. తైపింగ్ తిరుగుబాటులోనూ, బాక్సర్ తిరుగుబాటులోనూ ప్రకటించుకున్న లక్ష్యాలలో స్త్రీ పురుష సమానత్వం ఒకటి, ఎంత లోపపూరితమైన అవగాహనతో అయినా వాళ్ళు తమ సైన్యంలో స్త్రీ దళాలను ఏర్పాటు చేశారు. సాహిత్యంలోకూడా స్త్రీ పురుష సమానతా దృక్పథం బలంగానే వెలుపడడం మొదలయింది. 1860లలో వచ్చిన ఒక నవలలో రచయిత ఇవాళ్టి సమాజంలో పురుషులకు ఉన్న అన్ని అధికారాలూ స్త్రీలకు ఉండే ఒక సమాజాన్ని, పురుషాధిపత్యం స్థానంలో స్త్రీ ఆధిపత్యాన్ని సృష్టించి పురుషాధిపత్యాన్ని చీల్చి చెండాడాడు. (ఇంగ్లీషు వివరణను బట్టి చూస్తే ఈ నవల సరిగ్గా అదే కాలంలో కందుకూరి వీరేశలింగం రాసిన సత్యరాజా పూర్వదేశ యాత్రలులోని ఆడ మలయాళం వర్ణనకు సరిపోతుందని అనిపిస్తుంది.)

చైనా సమాజంలో ఇలాంటి రెండు శతాబ్దాల ధిక్కరణ సాంప్రదాయానికీ, విప్లవ సాంప్రదాయానికి వారసత్వం వహిస్తూ వచ్చిన మే 4 ఉద్యమం స్త్రీ పురుష

సంబంధాలలోని అవసరమైన ప్రశ్నలన్నిటినీ ముందుకు తెచ్చింది. స్త్రీ సమస్య అవగాహనలో చైనా యువతరానికి మే నాలుగు ఉద్యమం ఒక గొప్ప కుదుపు ఇచ్చి వంద పూలు వికసించడానికీ, వెయ్యి ఆలోచనలు సంఘర్షించడానికి కారణమైంది. ఈ వెలుగులో పుట్టిన చైనా కమ్యూనిస్టు పార్టీ మహిళా ఉద్యమం గురించి మొదటి నుంచీ శ్రద్ధ వహిస్తూనే వచ్చింది.

అణగారిన పీడిత రైతాంగ స్త్రీలతో ప్రత్యేకంగా నిర్మించిన మహిళా ఉద్యమాన్ని కమ్యూనిస్టు పార్టీ విముక్తి ప్రాంతాలలో విస్తరింపజేసింది. మొదట సంకోచంగానూ, అపనమ్మకంతోనూ మొదలయినప్పటికీ మహిళా సంఘాలు మహిళల చైతన్యాన్ని పెంపొందించడంలో సఫలమయ్యాయి. వాళ్ళను శ్రామిక శక్తిలోకీ, యుద్ధ కార్యక్రమాల్లోకీ, భూసంస్కరణలలోకీ సమీకరించగలిగాయి. ఈ చర్యలవల్ల ఆర్థిక వ్యవస్థకు సరాసరిగా మేలు జరగడం, విముక్తి ప్రాంతంలో పోరాటశక్తి పెంపొందడంతో పాటు రైతాంగ స్త్రీల ఆర్థికపాత్ర, సాంప్రదాయిక సామాజిక శ్రమవిభజనా పునర్నిర్వచించబడి వాళ్ళ గురించి వాళ్ళకున్న అభిప్రాయాలనూ, అంచనాలనూ గణనీయంగా మార్చడం సాధ్యమయింది వాళ్ళ హోదాను కుటుంబంలోనూ, గ్రామంలోనూ పై స్థాయికి తీసుకుపోవడం వీలయింది. కొత్తగా పొందిన వ్యక్తిగత సామూహిక శక్తిస్థానం నుంచి స్త్రీలు తమ స్వంత ప్రయోజనాలను రక్షించుకోవడం మొదలుపెట్టారు, తొలి రోజుల్లో వచ్చిన వివాహ, ఎన్నికల, భూమి చట్టాల వంటి కొత్త హక్కుల్ని గెలుచుకున్నారు. రైతాంగ స్త్రీలు తమ విజయాన్ని ఎర్రసైన్యం విజయంతో అనుబంధించుకున్నారు.

ఈ పూర్వరంగంలో చైనా సమాజం అర్థ వలస-అర్థ భూస్వామ్య బంధనాల నుంచి విడివడి నూతన ప్రజాస్వామిక రాజ్యంగా రూపుదిద్దుకుంది. 1949 - 56 కాలంలోనూ, 1956 తర్వాతా చైనాలోని మిగతా అన్ని సామాజిక, ఆర్థిక రాజకీయ విధానాలలాగే మహిళా ఉద్యమం, స్త్రీ సమస్యలపట్ల కూడా కమ్యూనిస్టు పార్టీ వైఖరి ఎన్నో ఆటుపోట్లను ఎదుర్కొంది. ఐతే ఎన్ని పెడధోరణులు ప్రవేశించినా 1949 నుంచి 1970ల చివరివరకూ చైనా మహిళా ఉద్యమం స్థూలంగా సవ్యమైన మార్గాన్నే నడిచింది. ఆ మార్గంలో అది ఎలాంటి ఒడిదుడుకులను ఎదుర్కొన్నదో

ఎలా సరిచేసుకున్నదో వివరిస్తూ ముగ్గురు పాశ్చాత్య రచయితలు రాసిన పుస్తకాల ఆధారంగా చైనాలో స్త్రీ సమస్యను పరిశీలిద్దాం.

డెలియాడేలిన్ రాసిన పుస్తకం 1950 దశకాన్ని చర్చించగా, ఎలిజబెత్ క్రోల్ పుస్తకం 1949 నుంచి 1973 వరకు చైనా భాషలో వచ్చిన రచనలను సంకలితం చేస్తూ మహిళా ఉద్యమాన్ని వివరించింది. క్లాడీ బ్రొయెల్ పుస్తకం విప్లవం నుంచి 1971 వరకు సాగిన మహిళా ఉద్యమ ధోరణినంతా పరిశీలిస్తూ కొన్ని తాత్వికచర్చలు చేసింది. ఈ ముగ్గురి పరిశీలనా చట్రాలు విభిన్నమైనవి. డెలియాడేలిన్ ప్రధానంగా పార్టీకీ, మహిళలకూ ఉన్న సంబంధాన్ని గురించి రాయదలచుకుంది గనుక విప్లవానికి ముందు విముక్తి ప్రాంతాలలో కమ్యూనిస్టు పార్టీ మహిళలపట్ల అనుసరించిన వైఖరిని చెప్పి, విప్లవం తర్వాత మహిళా సంఘాల గురించీ, పెళ్ళి,కుటుంబం గురించీ, గ్రామీణ, పట్టణ ప్రాంతాల మహిళా ఉద్యమాల తారతమ్యం గురించీ మాత్రమే చర్చిస్తుంది. అక్కడక్కడ తర్వాత కాలం మీద వ్యాఖ్యలున్నప్పటికీ అవి సమగ్రమైనవేమీకాదు. ఎలిజబెత్ క్రోల్ స్త్రీ సమస్యను మూడు రంగాలలో కుటుంబం, సమాజం, భావజాలం- పరిశీలిస్తుంది. క్లాడీ బ్రొయెల్ స్త్రీ సమస్యను సామాజిక శ్రమ, ఇంటిపని, పిల్లల పెంపకం, కుటుంబం, లైంగిక సంబంధాలు అనే ఐదు అంశాలలో పరిశీలిస్తుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థకూ లేదా ఆధునిక వ్యవస్థకూ స్త్రీకీ ఉన్న సంబంధం ఏమిటి? వ్యవస్థలో ఒక మనిషిగా స్త్రీకి వ్యవస్థతో ఉండే సాంఘిక సంబంధం ఏఏ రూపాల్లో వ్యక్తమవుతుంది? స్త్రీని పురుషుడు దోపిడీ చేయడం, అణచివేయడం సామాజిక శ్రమ, ఇంటిపని, పిల్లల పెంపకం, కుటుంబం, లైంగిక సంబంధాలు అనే ఐదు అంశాల్లో వివిధ స్థాయిల్లో, వివిధ రకాలుగా జరుగుతుంది. పితృస్వామిక భావజాలం ఈ ఐదు రూపాలను ఎంత సుస్థిరంగా, ప్రశ్నించడానికి వీలు లేకుండా తయారు చేసిందంటే ఎంత ఆలోచనాపరులైన, ప్రగతిశీలురైన పురుషులు కూడా ఈ ఐదింటిలో ఏదో ఒక రూపంలో వ్యవస్థ స్త్రీమీద సాగిస్తున్న ఆధిపత్యాన్ని మౌనంగా ఆమోదిస్తారు. అందుకే క్లాడీబ్రొయెల్ ఈ అంశాలనే ఒక్కొక్కటి విడి విడిగా చైనా సమాజానికి అన్వయించి, సోదాహరణంగా ఆ సమాజ అనుభవాన్ని చర్చించారు.

మొదటిది సామాజిక శ్రమ. స్త్రీలకు ఉత్పత్తిలో భాగస్వామ్యం లేకపోవడమే వాళ్ళ అస్వతంత్రతకు ముఖ్యమైన పునాది. ఈ అస్వతంత్ర పితృస్వామిక సమాజంలో సహజంగానే తండ్రిమీద అన్నదమ్ముల మీద, భర్తమీద, కొడుకుమీద ఆధారపడవలసిన స్థితికి స్త్రీని నెట్టివేస్తుంది మొట్టమొదట ఈ బానిసత్వాన్ని ఎదిరించడానికైనా స్త్రీలు కొందరు ఎవరికివారు కుటుంబాలనుంచి బైటికివచ్చి ఉత్పత్తిలో పాల్గొనాలని నిర్ణయించుకున్నారు మరోవైపు సోషలిస్టు సమాజ నిర్మాణ లక్ష్యంతో, స్త్రీలను ఉత్పత్తి కార్యక్రమంలో ప్రవేశపెట్టాలనే లక్ష్యంతో పార్టీ, మహిళాసంఘం అందుకు పూనుకున్నాయి.

ఇలాంటి కొన్ని స్త్రీల సామాజిక ఉత్పత్తి కేంద్రాలను పరిశీలించి క్లాడీ బ్రాయెల్ అక్కడి స్త్రీల అనుభవాలు రాశారు. మొదట ఈ సామాజిక ఉత్పత్తిలో పాల్గొనడానికీ కొందరే స్త్రీలు బైటకి వచ్చినప్పటికీ, కొంతకాలానికి మిగతా స్త్రీలు కూడా క్రమక్రమంగా ఈ విషయాన్ని గ్రహించారు. "ఇంతకాలమూ మా శక్తులు మా కుటుంబాలకు మాత్రమే ఉపయోగపడి నిరర్థకమైపోయాయి. ఇప్పుడు మేం మా శక్తుల్ని సమాజానికీ, ప్రజలకూ వినియోగిస్తాం" అని స్త్రీలు ముందుకొచ్చారు. అంటే స్త్రీ శ్రమ వ్యక్తిగత స్థాయినుంచి సామాజిక స్థాయికి ఎదిగింది. ఇది ఒకరికి సేవ చేయడం నుంచి పదుగురికి సేవచేయడం మాత్రమే కాదు, సామాజికస్థాయి శ్రమకూ వ్యక్తిగత స్థాయి శ్రమకూ మధ్య గుణాత్మకమైన భేదం ఉంది. సామాజిక స్థాయి శ్రమ మేధో సృజనాత్మకతకు, బుద్ధి వికాసానికి వీలయినన్ని అపూర్వ అవకాశాలను కల్పిస్తుంది. శ్రామికుల చైతన్య స్థాయిని పెంచుతుంది. శ్రామికుల సంఘటితశక్తిని సంఘ చైతన్యాన్ని పెంపొందిస్తుంది.

అయితే ఈ క్రమం నల్లేరుమీద బండిలా సాఫీగా ఏమీ సాగలేదు. ఎన్నో కష్టాలూ సమస్యలూ ఎదురయ్యాయి. పురుషులనుంచి అంతటా ఒకే రకమయిన, సుహృద్భావపూరితమయిన సహకారం అందలేదు ఆయినా స్త్రీలు పట్టుదలగా ముందుకు సాగారు. వాళ్ళ వీధుల్లోనే చిన్న చిన్న కర్మాగారాలు నిర్మించుకున్నారు. వీధి కమిటీల సాయంతో ఖాళీగా ఉన్న గోదాములనూ, గిడ్డంగులనూ కర్మాగారాలుగా మార్చారు. అంతకన్నా ముఖ్యమైన సమస్యలు వాళ్ళకు పిల్లల్ని ఉంచడానికి శిశు సం

రక్షణ కేంద్రాలుగానీ, భోజనానికి క్యాంటీన్‌లుగానీ, పనికి అవసరమైన పనిముట్లుగానీ లేవు. పని విధానంలో అనుభవం లేదు. ఉన్నదల్లా దీక్ష, పట్టుదలా మాత్రమే. మొదట వాళ్ల ఆ ప్రాంతానికి అవసరమయేవీ, తేలికగా ఉత్పత్తి చేయగలిగేవీ తయారు చేయడం మొదలెట్టారు. ఆ రకంగా చిన్న చిన్న వస్తువులు, మూకుళ్లు, గిన్నెలు, స్టౌ పైపులతో మొదలుపెట్టి క్రమంగా వాళ్ల బైటినుంచి వచ్చిన అనుభవజ్ఞులద్వారా సాంకేతిక పరిజ్ఞానం పొంది వైద్యపరికరాలు తయారు చేసేదాకా ఎదిగారు. కర్మాగారం బాగా నిలతొక్కుకున్నాక శిశు సంరక్షణ కేంద్రం, క్యాంటీన్ కూడా నిర్మించుకున్నారు. అట్లా వాళ్ళు ఎవరి సహాయం లేకుండానే, ఎవరినీ దేబిరించకుండానే వాళ్ళంతట వాళ్ళే వంటింటి జైలునుంచి బయటపడి సామాజిక ఉత్పత్తిలో భాగమయ్యారు.

ఐతే వంటపని ఎవరు చేస్తారనేది పెద్ద సమస్య అయిపోయింది. పిల్లలను చూడడానికైతే శిశు సంరక్షణ కేంద్రాలు వచ్చాయి. లేదా పక్కింటివాళ్ళో, ముసలివాళ్ళో చూసేవాళ్లు. కాని వంట మాత్రం సమస్యగానే మిగిలింది. ఈ సమస్యకు ఒక పరిష్కారంగా భర్తలను ఇంటిపనిలో భాగం పంచుకొమ్మన్నారు. ఇదికాక సామూహిక వంటశాలలు నిర్మించారు. అక్కడ స్త్రీలు, ముసలివాళ్లు పనిచేసేవాళ్ళు. ఐతే ఇక్కడ ఎవరు పనిచేస్తారనేది అంత ముఖ్యం కాదు. వ్యక్తిగత స్థాయిలో ఉండిన వంటపనికీ, సామాజిక స్థాయిలో వంటపనికీ తేడా ఉంది. సామాజిక స్థాయి వంటపనికి ముఖ్యమైనదిగా, గౌరవనీయమైనదిగా, అవసరమైనదిగా, గుర్తింపు ఉంటుంది. కాబట్టి ఆ పనికి ఎవరు చేశారనే దానితో ప్రమేయం లేకుండా మన్నన ఉంటుంది.

క్రమంగా ఈ స్త్రీలే ఉత్పత్తిలో ఆధునిక పద్ధతులలో శిక్షణ పొంది పెద్ద పెద్ద కర్మాగారాలు నిర్మించి క్లిష్టమైన వస్తువులనుకూడా తయారుచెయ్యడం మొదలుపెట్టారు. ఈ కర్మాగారాల్లో స్త్రీ పురుషులకు సమానమైన వేతనాలే ఇచ్చేవారు. ఈ క్రమంలో జ్ఞానం, శ్రమ; సిద్ధాంతం, ఆచరణ; మేధావి, శ్రామికుడు అనే కృత్రిమ విభజనలు సమసిపోయి ఒక నూతన మానవుడు నిర్మాణమయ్యాడు, ఒక నూతన మానవి నిర్మాణమయింది.

ఐతే సామాజిక శ్రమ మాత్రమే స్త్రీ విముక్తిని సాధిస్తుందా? అది సాధ్యం కాదు. ఎందువల్లనంటే స్త్రీని బానిసగా ఉంచే, స్త్రీ విముక్తికి అడ్డుతగిలే అనేకానేక కారణాలలో అది ఒక ప్రధాన కారణమే తప్ప ఏకైక కారణం కాదు. అందువల్లనే క్లాడీ బ్రోయెల్ ఏమంటుందంటే, "....సామాజిక శ్రమలో భాగస్వామ్యం స్త్రీలను విముక్తి చేయలేదు. ఐనప్పటికీ వాళ్ళు తమపై సాగుతున్న అణచివేతను గుర్తించడంలో, తమతిరుగుబాటును సామాజికం చేయడంలో (సోషలైజేషన్ ఆఫ్ రిబెలియన్) అది నిర్ణయాత్మకమైన అంశంగా పనిచేసింది. 'స్త్రీల పరిస్థితి', లేదా స్త్రీ కావడం అనే దురదృష్టంలో ఉండే అణచివేతను వాళ్ళు మరింత చైతన్యపూర్వకంగా తెలుసుకోవడానికి అది తోడ్పడింది.

రెండవది ఇంటిపని. ఇంటిపనిని సామాజికం చేస్తేగాని స్త్రీ పురుష సమానత్వం సాధ్యం కాదు. స్త్రీ ఇంటిపనిలో చిక్కుకుని ఉన్నన్నాళ్ళు ఉత్పత్తిలో స్థానం పొందలేకపోతుంది. అంటే స్త్రీకి ఇంటిపనితో రెండు నిర్బంధాలను ఏకకాలంలో పాటించవలసిన పరిస్థితి వస్తుంది. ఇంటి చాకిరీలో మునిగిపోయి అనుత్పాదక శ్రమే జీవితలక్ష్యంగా చేసుకోవడం ఒకటి, అందువల్లె బైటి సమాజంలోని ఉత్పాదకశ్రమలో భాగం పంచుకోలేక పోవడం మరొకటి. ఈ రెండు నిర్బంధాలూ వాటి తార్కిక ఫలితంగా స్త్రీని తక్కువ స్థానంలోకే నెడతాయి.

ఎక్కువ ఉత్పత్తిని సాధించడానికి స్త్రీలను మరింతగా ఉత్పత్తి కార్యక్రమంలోకి తీసుకరాదలచిన పెట్టుబడిదారీ వ్యవస్థ ఇంటిపనులకై ఎన్నో సాధనాలనూ, భారీ ఆధునిక యంత్రాలనూ కనిపెట్టింది. కాని వాటివల్ల సమస్యలు తగ్గడంకాక ఇతర కొత్త సమస్యలు ముందుకొచ్చాయి. సాధారణంగానే ఇప్పటివరకూ సాగిన అభివృద్ధి క్రమమంతా పురుషానుకూలంగా స్త్రీ వ్యతిరేకంగా ఉంటూవచ్చింది. డెలియాడేవిన్ తన పుస్తకంలో వివరించినట్లు ఇప్పటివరకు వచ్చిన ఆర్థిక, పారిశ్రామిక సాంఘిక అభివృద్ధి క్రమాల ప్రత్యక్ష, పరోక్ష ఫలితాలు స్త్రీ వ్యతిరేకంగానే ఉన్నాయి.

ఇంటిపని యంత్రాల విషయమే తీసుకుంటే అవి బాగాఖరీదయినవి. వాటితో పని చేయడం నేర్చుకోవాలి. చెడిపోతే బాగు చేయించడానికి ఇబ్బంది పడాలి. ఇంటిపని స్త్రీ బాధ్యతగానే ఉన్నచోట యంత్రాలతో సౌలభ్యం మాటఉంచి స్త్రీకి అదనంగా

యంత్రాల సంరక్షణ పని వస్తుంది. ఈ ఫలితాలేకాక, సాంప్రదాయిక సమాజాలలో స్త్రీకి ఉన్న సాంఘిక సంబంధాన్ని యంత్రాలెట్లా ధ్వంసం చేశాయో గ్లాడీ బ్రాయెల్ వివరిస్తుంది. "సంవత్సరాలకింద కొళాయి నీళ్లు లేకుండా ఉండవచ్చు. కాని స్త్రీలు బట్టలుతకడానికి చాకిరేవుకు వెళ్ళినప్పుడు కనీసం వాళ్ళకు ఇతర స్త్రీలను కలిసే అవకాశం ఉండేది. తమకూ, ఊరికీ ముఖ్యమనుకున్న సంగతులు మాట్లాడుకునే వీలుండేది. కొళాయినీళ్లు ఈ చాకిరీని తొలగించిన మాట నిజమేగాని, అదే సమయంలో స్త్రీలమధ్య సాంఘిక సంబంధం కూడా తెగిపోయింది. అప్పటినుంచి, నాలుగు గోడల లోపల జరిగే బట్టలుతికే శ్రమ 'కనబడకుండా' పోయింది. సాంఘికంగా చెప్పాలంటే ఉనికిలో లేనిదయిపోయింది."

దీనితో తెలిసేదేమంటే కుటుంబాన్ని సాంఘిక యూనిట్‌గా అలాగే ఉంచి ఇంటిపనిని యాంత్రీకరించడం దుష్ఫలితాలకే దారితీస్తుంది. కాని ఈ యంత్రాలను ఒక్కొక్క కుటుంబానికి పరిమితం చేయకుండా సామాజికంగా వాడితే వాటివల్ల తప్పకుండా లాభం ఉంటుంది. ఐతే ఇక్కడ స్పష్టంగా గుర్తించవలసిన విషయాలు రెండున్నాయి. ఒకటి, ఇంటిపని సామాజికం అవుతున్నకొద్దీ కుటుంబం అనేది మౌలిక సాంఘిక యూనిట్‌గా క్రమక్రమంగా రద్దయిపోతుంది. రెండు, ఇంటిపనుల సామాజికీకరణ, యాంత్రీకరణ ఒకే సమయంలో జరగాల్సి ఉంటుంది.

ముందు రెండు మూడు కుటుంబాలు కలిసి ఒక్క యూనిట్‌గా పనులు పంచుకోవడం ద్వారానో, ఇంటిపనులలో వీలయిన అన్నిటినీ సామూహికంగా కలిపి చేసుకోవడం ద్వారానో దీన్ని సాధించవచ్చు. ఇంటిపనులలో ప్రధానమైనదీ ఎక్కువ సమయాన్ని హరించేదీ వంటపని. ముందుగా దీన్ని సామాజికం చెయ్యాల్సివుంటుంది. ఇందుకుగాను చైనా కమ్యూన్లలో సామాజిక వంటశాలలు ఏర్పరిచారు. అక్కడ ఎవరైనా వచ్చి తినవచ్చు, లేదా కావాలంటే ఇంటికి తీసుకెళ్ళవచ్చు. ఐతే ఈ సామాజిక వంటశాలలు ముఖ్యంగా ఉత్తర, ఈశాన్య ప్రాంతాలలో ఒక సాంకేతిక ఇబ్బందిని ఎదుర్కొన్నాయి. ఆ ప్రాంతాలలో సాంప్రదాయికంగా చలినుంచి తట్టుకోవడానికి వంట పొయ్యితోనే ఇంటిని వెచ్చబరుచుకుంటారు. వంటపని కమ్యూన్ వంటశాలే చూసినప్పటికీ, ఇల్లు వెచ్చజేసుకోవడం కోసం పొయ్యి అంటించకతప్పదు. కమ్యూన్‌లోని అన్ని ఇళ్ళనూ సామూహికంగా వెచ్చజేసేంత ఉన్నత సాంకేతిక

పరిజ్ఞానం ఆ కమ్యూన్‌కు లేదు. తత్ఫలితంగా ప్రధానంగా ఈ ప్రాంతాలలో సామాజిక వంటశాలలు వెనుకపట్టు పట్టాయి. మొత్తంమీద కనీసం రెండు మూడు కుటుంబాలు కలిసి వండుకోవడం అనే సాంప్రదాయమయినా అమలులోకొచ్చింది.

ఇక స్త్రీ బాధ్యతగా ఉన్న మిగతా ఇంటి పనులు-బట్టలు ఉతకడం, చిరిగిన బట్టలు కుట్టడం, జోళ్ళు అల్లడం లాంటివి కూడా సామాజికం చేశారు ఎక్కువగా పిల్లలు, ముసలివాళ్లు ఇంటింటికీ తిరిగి బట్టలు, జోళ్లు సేకరించి, కుట్టి, బాగుచేసి తిరిగి ఇచ్చేసేవాళ్ళు. బట్టలుతకడానికీ, బాగుచేయడానికీ పెద్ద ఎత్తున లాండ్రీలు ఉండేవి. అక్కడక్కడ ఇళ్ళలోకూడా చిన్న చిన్న కుట్టుపనులు చేసేవాళ్ళు. ఈ పనులు చేసినందుకు నామమాత్రమైన రుసుము వసూలు చేసేవారు. ఇక సినిమాలు, వివాహావంటివి చాలవరకు ఉచితంగానే ఉండేవి. నీళ్ళు ప్రతిఇంటికీ పంపుల్లోవచ్చేవి. సామాజికం చెయ్యడం సాధ్యంకాని కొన్ని పనులు ఇంట్లో అందరూ కలిసి చేసేవారు. ఎక్కడైనా భర్తలు పనులు చెయ్యడానికి నిరాకరిస్తే మిగతా వాళ్ళందరూ కలిసి ఆయనతో చర్చించి ఒప్పించేవారు.

ఈ మొత్తం క్రమంలో ప్రధానమైన అంశమేమంటే చిన్న చిన్న ఇంటి పనులుగా, అనుత్పాదకమైనవిగా సమాజం ఇంతవరకూ పరిగణించిన పనులు ఎంత విలువయినవో, ఎంత అవసరమయినవో ఈ కృషివల్ల అందరికీ తెలిసింది. శారీరక శ్రమకూ మేధో శ్రమకూ మధ్య గండిపూడుస్తున్న క్రమంలోనే ఇంటి శ్రమకూ సామాజిక శ్రమకూ; స్త్రీ శ్రమకూ, పురుషుని శ్రమకూ మధ్య గండి పూడడం ప్రారంభమైంది. స్త్రీ శ్రమను ఐతే హీనపరచడమో, కాకపోతే కీర్తించడమో మాత్రమే ఎరిగి ఉన్న సమాజంలో చైనా కమ్యూనిస్టులు దాని విలువనూ అవసరాన్నీ వాస్తవికంగా గుర్తింపజేసి దానికీ ఆ శ్రమ చేసేవాళ్ళకూ ఉచితమైన గౌరవాన్నీ స్థానాన్నీ సాధించారు.

స్త్రీ చేసే సేవల్లో మరొక ముఖ్యమైనది జబ్బుపడిన వారిని సంరక్షించడం. ఈ సమస్యను పరిష్కరించడానికి సమాజంలో సాధారణ స్థాయిలో వైద్య, ఆరోగ్య విజ్ఞానాన్ని ప్రచారం చేసారు. పిల్లలకు బడిలోనే తప్పనిసరిగా జబ్బుల గురించీ వాటి నివారణ గురించి నేర్పించారు. దానితో పిల్లలు తాము నేర్చుకున్న ఆరోగ్య

సూత్రాలు పాటించడమేగాక ముసలివాళ్ళకు నేర్పేవారు కొంతమంది గృహిణులు ప్రాథమిక వైద్యపరిజ్ఞానం నేర్చుకుని చిన్న చిన్న జబ్బులు నయంచేసే స్థానిక వైద్యులుగా కూడా ఉండేవాళ్ళు.

ముప్పై ఏళ్లుగా పార్టీలో ఉంటూ మహిళా ఉద్యమ బాధ్యత నిర్వహిస్తున్న సుయిన్ మాటల్లో చెప్పాలంటే "స్త్రీ విముక్తికి కీలకమైనది ఇంటిపని సామాజికీకరణే. ఈ సామాజికీకరణను సాధించకుండా స్త్రీ పురుష సమానత్వం లాంఛన ప్రాయమే అవుతుంది. వాస్తవంలో లేకుండా చట్టంలో మాత్రమే ఉంటుంది. ఈ సామాజికీకరణను సాధించకపోతే స్త్రీ పురుషుల మధ్య శత్రుత్వం పరిష్కారంకాదు. అంటే అంతిమ పరిశీలనలో సోషలిజం విఫలమవుతుంది...."

మూడవది పిల్లల పెంపకం. మాతృత్వాన్ని కేవలం తల్లి బాధ్యతగా కాక సమాజం బాధ్యతగా చెయ్యడం, అంటే మాతృత్వాన్ని సామాజికం చెయ్యడం అనేది ఒక సమస్యగా గుర్తించడంగానీ, దానిగురించి ఆలోచించడంగానీ జరగడమేలేదు కాని స్త్రీ విముక్తిలో పిల్లల పెంపకాన్ని సామాజికం చెయ్యడం కూడా ఒక ముఖ్యమైన అంశం. ప్రస్తుతం పిల్లలకీ తలిదండ్రులకీ, ముఖ్యంగా పిల్లలకీ తల్లికీ ఉన్న సంబంధాలలో తొలగించవలసిన దాన్నంతా తొలగించి, వాటిని సమూలంగా మార్చి పిల్లలు నూతన మానవులుగా తయారయ్యే పరిస్థితి సృష్టించాలి.

ఇప్పుడు పిల్లలకీ తల్లిదండ్రులకీ ఉన్న సంబంధాల ఫలితంగా పిల్లలు పుట్టిన క్షణం నుంచీ ఏదో ఒక రకమైన అణచివేతకు గురవుతున్నారు. ఈ అణచివేత బడిలో క్రమశిక్షణ పేరుమీద సాగవచ్చు, ఇంట్లో తల్లిప్రేమ పేరుమీద సాగవచ్చు, తండ్రి అన్నా, బూచి అన్నా ఉండే భయంవల్ల సాగవచ్చు. ఏదేమైనా బలవంతంగా వాళ్ళమీద రుద్దబడుతున్న ఈ క్రమశిక్షణ పిల్లల్లో భయాన్నీ, లొంగుబాటుతనాన్నీ పెంచి, వాళ్ళలో పట్టుదలనూ, జిజ్ఞాసనూ నశింపజేస్తుంది.

ఇక తల్లి-బిడ్డ సంబంధాలలో విచిత్రమైన విషయం ఒకటుంది. బిడ్డను శిశు సంరక్షణ కేంద్రానికి పంపే తల్లి తానేదో పెద్ద తప్పు చేస్తున్నట్టు భావిస్తుంది. ఈ తప్పు చేశానన్న భావన స్త్రీని లొంగుబాటుతనంలోనూ, భావజాలపరమైన పరాధీనతలోనూ ఉంచుతుంది. బూర్జువా వర్గానికి కావలిసిందదే. ఇలాంటి అస్పష్టమైన

నిర్బంధంతో బూర్జువా వ్యవస్థ తల్లిని శిశుపోషణలో తాననుకున్న స్థానానికి నెడుతుంది. తానుకోరుకున్న విధంగా తల్లిని రూపొందించడానికి వ్యవస్థ చేతిలో బిడ్డే ఒక సాధనం. సూటిగా బిడ్డ తల్లిపైద నిర్బంధం నెరపదు. కాని తల్లికి బిడ్డ తన కలల ప్రతిరూపంగా, తన ఆశలకూ ఊహలకూ చిహ్నంగా కనిపిస్తుంది. తన ప్రేమనంతటినీ ఆ బిడ్డకు ధారపోసి ఆబిడ్డే తన జీవితానికి అర్థమని భావిస్తుంది. దీనికి ప్రతిఫలంగా తనుకూడా బిడ్డదగ్గరినుంచి అలాంటి ప్రేమనే ఆశిస్తుంది. బిడ్డ పూర్తిగా తనపై ఆధారపడాలని కోరుకుంటుంది. (మాతృప్రేమను కూడా మారకపు విలువకు లోబరిచే సమాజంలో ఇది క్రూరమైన వాస్తవం!) ఆ ప్రేమతోనే బిడ్డను తానే ఒక రకమైన నిర్బంధానికి గురిచేస్తుంది. మరోవైపు బిడ్డపుట్టే కలలన్నీ అల్లుకుని ఆ కలల వల్ల అణచివేతకు గురవుతుంది. అంటే ఈ నిర్బంధం పరస్పరం సాగుతుంది. ఇంతకూ నిర్బంధం నిండిన ఈ ప్రేమవల్ల తల్లికిగానీ, బిడ్డకుగానీ ఆత్మ సంతృప్తి లేదు ఇలా ఒకరినొకరు బానిస చేసుకోవడం వ్యవస్థలో బానిసలుగా తమ పాత్రలు పోషించడానికే.

ఈ స్థితి నుంచి తల్లినీ బిడ్డనీ కూడ రక్షించవలసి ఉంది. అంటే పిల్లల పెంపకాన్ని సామాజికం చెయ్యడం ద్వారా దానిలోని వ్యక్తిగత నిర్బంధ అంశాన్ని రద్దు చేయ్యాలి. పిల్లల్ని పోషించడమే కాక సమాజంలో చెయ్యవలసిన పనులు చాలా ఉన్నాయనే అవగాహనను స్త్రీలలో పెంపొందించాలి పిల్లల పెంపకాన్ని ప్రధానంగా శిశు సంరక్షణ కేంద్రాల ద్వారా సామాజికం చెయ్యాలి.

బోల్షివిక్ విప్లవం విజయవంతంకాగానే స్త్రీ విముక్తిలో తల్లిని పిల్లల పెంపకపు 'కష్టం' నుంచి విముక్తి చెయ్యడం అవసరమని గుర్తించారు. ఐతే ఈ గుర్తింపు చాలా యాంత్రికమని క్లాడీ బ్రాయెల్ అంటుంది. ఉదాహరణకు ఆమె లిలినా జినోవీవ్, కొల్లొంటాయ్‌ల ప్రకటనలను ప్రస్తావిస్తుంది. లిలినా జినోవీవ్ మాటల్లో "కుటుంబజీవితపు దారుణమైన ప్రభావం నుంచి మనం పిల్లల్ని రక్షించాలి.... మనం వాళ్ళని జాతీయం చేయాలి.... ఇప్పుడు మన కర్తవ్యం పిల్లల్ని మనకు, అంటే సోవియట్ ప్రభుత్వానికి అప్పగించేట్టు తల్లిని ఒప్పించడమే...." కొల్లొంటాయ్ మరికాస్త ముందుకు వెళ్ళి "పిల్లలు ప్రభుత్వానికీ చెందుతారు. మాతృత్వపు సాంఘిక బాధ్యత ఏమంటే ఆరోగ్యకరమైన, జీవించే యోగ్యతగల శిశువును కనడమే.... ఆమె రెండో బాధ్యత.... శిశువుకు పాలు కుడపడం...." అంటుంది.

క్లాడీ బ్రొయెల్ ఈ రెండు వాదనలనూ తిరస్కరించి క్రుప్‌స్కయాతో ఏకీభవిస్తుంది. క్రుప్‌స్కయా మాటల్లో "పిల్లలు తల్లిదండ్రులకీ చెందరు, ప్రభుత్వానికీ చెందరు. వాళ్ళు వాళ్ళకే చెందుతారు" వాళ్ళ బాధ్యత తల్లిదండ్రుల మీదే కాక సమాజమంతటి మీదా ఉంటుంది అందరూ కూడ వాళ్ళ మానసిక, శారీరక అభివృద్ధికి బాధ్యత వహించాలి.

చైనాలో పిల్లల పెంపకం, విద్య సరిగ్గా ఈ సరైన అవగాహనమీద ఆధారపడి ఉంది. ఐతే శిశు సంరక్షణ కేంద్రాల్లో కూడా పిల్లల పెంపకం ఎవరో ఒకరు చెయ్యాల్సిందేగదా, అప్పుడు నిర్బంధం కొనసాగదా అంటే, అసలు పెంపకాన్ని సామాజికం చెయ్యడంలో భాగంగా పిల్లలకు చిన్నప్పటినుంచి పూర్తి స్వాతంత్ర్యాన్నివ్వాలి, వాళ్ళను ఎవరిమీదా ఆధారపడకుండా చేయాలి. వాళ్ళను వాళ్ళ పనులు చేసుకోవడం నేర్చుకోనివ్వాలి. మొదటినుంచీ అన్ని పనులకీ అలవాటు చెయ్యాలి. 'ఇవి పెద్దవాళ్ళ పనులు' అని వాళ్ళను ఏ పని నుంచీ దూరం చెయ్యగూడదు పెద్దవాళ్ళు తప్పులు చెయ్యరనే కట్టుకథను బద్దలు గొట్టాలి ఏ పని అయినా అనుభవం మీద వస్తుందే తప్ప వయసుతో రాదని స్పష్టం చేయాలి.

అందుకే చైనాలోని శిశు సంరక్షణ కేంద్రాల్లో పిల్లలు ఎవరి పనులు వాళ్ళు చేసుకోవడమేగాక కూరగాయల చెట్లు పెంచడం, అంట్లు తోమడం వంటి పనులు కూడ చేస్తారు. అవికూడా ఒక హాబీగానో, సరదాకోసమో, ఎప్పుడో ఓసారో కాక అవసరమైన పని అనే గుర్తింపుతో చేస్తారు. బడిలోకూడా చిన్నచిన్న అట్టపెట్టెల తయారీవంటి పనులను పిల్లలకు అప్పగిస్తారు చిన్నవయసునుంచీ ఎవరి అభిప్రాయాలనూ వాళ్ళమీద రుద్దకుండా, వాళ్ళే స్వంతంగా తమ ఆలోచనలనూ అభిప్రాయాలనూ అభివృద్ధి చేసుకునేందుకు వీలు కలిపిస్తారు వాళ్ళకు పాఠాలలో కట్టుకథలు వాస్తవానికి దూరమైన గాథలు బదులు దైనందిన అనుభవంలో ఉండే పోరాటగాథలు, చరిత్ర చెపుతారు. వీలయినంత ఎక్కువగా పిల్లల సృజనాత్మక, ఊహాశక్తులను పెంచడానికి ప్రయత్నిస్తారు. ఈ అన్ని ప్రయత్నాలతో స్పష్టమయ్యేదేమంటే పిల్లల ప్రపంచం అంటూ విడిగా ఏదీ ఉండదు. పిల్లలు ఈ ప్రపంచంలోనే భాగం. వాళ్ళను సమాజ వాస్తవాలనుంచి విడదీసి వాళ్ళకు ప్రత్యేక ప్రపంచం సృష్టించగూడదు. పిల్లలు మానవ సమాజంలో భాగమేనని మనం గుర్తించి, వాళ్ళతో గుర్తింపజేయాలి.

పెట్టుబడిదారీ వ్యవస్థలో విద్యావిధానం పిల్లలకు స్వంత ఆలోచన రాకుండా అణచివేస్తుంది. తద్వారా వాళ్ళలో ప్రశ్నించే చైతన్యం నశిస్తుంది. ఏ విషయమైనా పుస్తకాలు చెప్తున్నాయి కాబట్టి అదంతే అనే భావన వస్తుంది. ఈ వ్యవస్థకి కావలసిన అభిప్రాయాలు ఈ రకంగా పిల్లల మీద రుద్దబడుతున్నాయి. చదువును సమాజం నుంచి పూర్తిగా వేరు చేస్తున్నారు. అందుకే సమాజంలో వచ్చే సమస్యలకి పుస్తకాల్లో పరిష్కారాలుండవు. పుస్తకాల్లో చదివింది సమాజంలో అన్వయానికి కుదరదు. ఈ చదువు పిల్లల్లో వాళ్ళలో వాళ్ళకే పోటీలు పెట్టి వాళ్ళలో అసహమ్మకాన్ని, దుష్పనాశతనాన్ని పెంచుతుంది. వాళ్ళ చిన్న బుర్రల్లో అసూయ, స్వార్థం, ద్వేషం ప్రవేశిస్తాయి.

కాని సోషలిస్టు వ్యవస్థలో విద్య ఇందుకు పూర్తిగా విరుద్ధంగా, భిన్నంగా ఉంటుంది. అక్కడ చదువు సమాజంతో ముడిపడి ఉంటుంది. చదువులో భాగంగానే వాళ్ళు ఉత్పత్తిలో పాల్గొంటారు. ఫ్యాక్టరీలలో, పొలాలలో పని చేస్తారు. అలా సమాజంలోని అన్ని అంశాలతోనూ వాళ్ళకు పరిచయమూ, ప్రవేశమూ ఉంటుంది. రాజకీయాలు, చరిత్ర చదువుకుంటారు. చదువులో భాగంగానే ముసలివాళ్ల చెప్పే వర్గపోరాట అనుభవాల గాథలు వింటారు. ప్రతి సంవత్సరమూ మూడు నెలల పాటు పిల్లలు కమ్యూన్‌లలో ఉండి ప్రజలతో కలిసిపోయి కష్టనష్టాలన్నీ స్వయంగా అనుభవిస్తారు. వాళ్ళకు చదువులో పరీక్షలు, బహుమానాలు, పోటీలు, శిక్షలు ఉండవు. ఒకళ్ళకి తెలిసినవిషయం అందరూ పంచుకుంటారు. ఒకళ్ళకొకళ్ళు పాఠాలు చెప్పుకుంటారు. ఆట పాటల్లో కూడా పిల్లల్లో ఆడ, మగ తేడాలేమీ ఉండవు. ఇద్దరూ ఆయుధాలు పట్టుకుంటారు, ఇద్దరూ ఇంటిపనులు నేర్చుకుంటారు. ఆటల పట్ల కూడా వాళ్ళ అవగాహన వేరుగానే ఉంటుంది. ఆటలు కూడ ప్రయోజనకరంగానే ఉంటాయి. ఉపాధ్యాయులు కూడ పిల్లల దగ్గర ఎన్నో విషయాలు నేర్చుకుంటారు. వాళ్ళ పాఠాల్లో అర్థంలేని లెక్కలుండవు. వార్తా పత్రికలే వాళ్ళ పఠ్యపుస్తకాలు, సమాజమే వాళ్ళ పాఠశాల.

సహవిద్య, ఆడపిల్లలకూ, మగపిల్లలకూ కలిపి విద్య అనేది ఇంతవరకూ ఇద్దరినీ కలిపి కూచోబెట్టడంగానే ఉంటున్నది. ఇంటిపనులు పాఠ్యాంశాలలో ఇద్దరికీ సమానంగా నేర్పుతున్నారా లేదా అనేదే సహవిద్యకు గీటురాయి. ఇంటిపనుల శిక్షణ

కేవలం నిజమైన సహవిద్య మాత్రమే కాదు. దానికి తక్షణ వాస్తవ విలువకూడా ఉంది. ఒక శిశువు తన బట్టలూ, జోళ్లూ తానే చూసుకుని, ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవడం బడిలో నేర్చుకుంటే, అంటే స్వయంపోషకంగా తయారయితే మొదట తల్లి ఎంతగానో విముక్తమవుతుంది. చైనా విప్లవం స్త్రీ విముక్తి విషయంలో సాధించిన అమృతాలలో ఇది ఒకటి.

"పిల్లల మొదటి ఉపాధ్యాయులుగా తల్లులు, స్త్రీలు ఎంతో ముఖ్యమైన పాత్ర చేపట్టవలసి ఉంది. వాళ్లు పిల్లలను నిర్బంధించడం, పిల్లలను లొంగదీయడం మానేయాలి.... ఒక శిశువును అణచివేసే స్త్రీ తనను తాను ఎప్పుడూ విముక్తి చేసుకోలేదు...." అంటుంది క్లాడీ బ్రాయెల్.

పిల్లల విముక్తి ప్రాముఖ్యాన్ని గుర్తించని విప్లవోద్యమం ఆత్మహత్యాసదృశమని, అంతిమ పరిశీలనలో అది విప్లవోద్యమమే కాజాలదనీ అంటూ క్లాడీబ్రాయెల్ స్త్రీ విముక్తికి పెద్దలకూ పిల్లలకూ మధ్య సమ సంబంధం పునాదిగా, పిల్లలను అన్ని సాంఘిక కార్యకలాపాలలో పాల్గొననిచ్చే ఒక కొత్త భావన అవసరమని అంటుంది.
నాలుగవది, కుటుంబం. సోషలిస్టు సమాజం వరకూ అన్ని సమాజాలలోనూ కుటుంబం సమాజానికి మౌలిక ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక యూనిట్‌గా ఉంటుంది. సోషలిస్టు సమాజంలో అది ఆర్థిక, సాంఘిక యూనిట్ బాధ్యతలను క్రమక్రమంగా వదిలించుకుంటూ సాంస్కృతిక యూనిట్‌గా కొనసాగుతుంది. అంటే సోషలిస్టు వ్యవస్థ కుటుంబాన్ని కొత్తగా నిర్వచించి, కొత్తరూపాన్ని సమకూర్చి, కొత్త బాధ్యతలు కలిపిస్తుంది. ఈ కుటుంబంలోని సభ్యులకు ఎవరికీ మరెవరిమీదా సర్వాధికారాలుండవు. అందరి మధ్య స్నేహ, సుహృద్భావాలుంటాయి. ఈ సమానత్వం వల్ల సహజమైన ప్రేమానురాగాలు వాటి సరైన అర్థంలో వికసిస్తాయి.

చైనాలో కుటుంబం గురించి చెపుతూ క్లాడీ బ్రాయెల్ "చైనాలో కుటుంబం ధ్వంసం చేయబడిందని మనం అంగీకరించవచ్చు. కుటుంబం అంటే భర్తకు భార్య లొంగుబాటు అనిగానీ, ఇంట్లో భార్య ఒంటరితనం అనిగానీ, పిల్లలమీద తల్లిదండ్రుల సంపూర్ణ అధికారం అనిగానీ మనం అర్థం చేసుకునేట్టయితే, ఆ కుటుంబం అదృశ్యమైంది. పురుషులందరూ ఆదర్శంగా భావించే ఏకాంత "శాంతి సామ్రాజ్యాన్ని", అది లేకపోతే జీవితానికర్థం లేదని పురుషులు భావించేదాన్ని మనం

కుటుంబమనేట్టయితే ఆ కుటుంబం అదృశ్యమయింది: భర్త పాలించే, తెలివితో, మోసంతో ఒంటరిగా దైనందిన జీవిత సమస్యలకై పోరాడే చిన్న ద్వీపాన్ని మనం కుటుంబమనేట్టయితే ఆకుటుంబం అదృశ్యమయింది: నిజమైన, నిర్దేశించినకుటుంబ విధులూ, నిర్మాణమూ చైనాలో కదిలిపోవడం మాత్రమేకాదు వాస్తవంగా రద్దయిపోయి, ఇతర నిర్మాణ రూపాలకు స్థానమిచ్చాయని మనం చూశాం.

అదే సమయంలో మొత్తం వాస్తవం కొందరికి నిరాశ కలిగించవచ్చు ఆ మొత్తం వాస్తవమేమంటే చైనాలో ఒక రకమైన కుటుంబం ఉనికిలో ఉంది. కుటుంబం అంటే స్థిరంగా ఉండే దంపతుల జంట వాళ్ళతోపాటే నివసించే పిల్లలు. ఆ పిల్లలుకూడ తర్వాత ఏర్పరుచుకోబోయే కుటుంబానికి అతీతంగా లైంగిక సంబంధాలు పెట్టుకోక పోవడం...."

1950లో చేసిన వివాహ చట్టం చైనాలో స్త్రీ పురుష సమానత్వ చరిత్రలో గొప్ప మైలురాయి. బహు భార్యాత్వం, ఉంచుకోవడం వంటి దురాచారాలను నిషేధించారు. పద్దెనిమిదేళ్ళలోపు యువతీ యువకుల వివాహాన్ని నిషేధించారు. వివాహానికి పరస్పర అంగీకారం ఒక్కటే ప్రాతిపదిక చేశారు. విడాకులకు కారణాలపై పరిమితులను తొలగించారు, విడాకులు ఉచితంగా ఇచ్చే ఏర్పాట్లు చేశారు.

ఐతే ఇది చట్టం మాత్రమే. ఎక్కువలో ఎక్కువగా ఈ చట్టం భూస్వామ్య ఆచారాల అంతాన్ని కాగితం మీద పెట్టింది ఆ తర్వాత ప్రాచీన కుటుంబ విధులను ఆచరణలో రద్దు చేయవలసివచ్చింది. భూసంస్కరణలు కుటుంబ వ్యవస్థను దెబ్బదీయడంలో బాగా ఉపయోగపడ్డాయి. నిజానికి 1950 కి ముందే విముక్తి స్థావరాలలో పార్టీ భూసంస్కరణలను అమలులో పెట్టి స్త్రీలకు ఆస్తి హక్కును ఇచ్చింది. భూస్వామ్య కుటుంబ వ్యవస్థలను భూసంస్కరణలు. దెబ్బతీసినట్టే నూతనప్రజాస్వామికం కింది బూర్జువా కుటుంబ వ్యవస్థలను విచ్ఛిన్నం చేయడంలో సామాజికీకరణ ఎంతో ఉపయోగపడింది.

శ్రామికుడు తనకంటూ ఒక వ్యక్తిగత జీవితాన్ని, తన ఆశలూ కలలూ కలబోసిన ఓ చిన్న స్వంత ప్రపంచాన్ని, కుటుంబాన్ని కోరుకోవడం పరాయీకరించబడుతున్న శ్రమకూ, పారిపోదగిన విశ్రాంతికీ మధ్య పూడ్చరాని అగాధం ఉన్నప్పుడే జరుగుతుంది. దుర్భరమైన శ్రమ చేస్తున్న శ్రామికుడు, శ్రమించ

దం ఒక మానవ సహజమైన లక్షణంగా, ఆనందంగా కాక ఇతరులకు అదనపు విలువ సంపాదించి పెట్టేదిగా, విసుగెత్తించేదిగా ఉంటే శ్రామికుడు పని చేస్తున్నంతసేపూ ఆ పని నుంచి పారిపోయి విశ్రాంతి పొందాలనుకుంటాడు. ఆ ఏకాంత శాంతి సామ్రాజ్యం అతనికి కుటుంబమే. ఆ విశ్రాంతి పట్ల ఆశతోనే శ్రమనంతా భరించి, విశ్రాంతిలోకి, తనదయిన జీవితంలోకి తప్పించుకుంటాడు. ఐతే పరయాకరించే శ్రమకూ, తప్పించే విశ్రాంతికీ మధ్య గండిని పూడ్చడం మొదలెట్టినప్పుడు కుటుంబంలో అనివార్యమైన మార్పులు వస్తాయి. ఒక కుహనా విశ్రాంతి కేంద్రం స్థానం నుంచి అది సమూహంలో ఒక ప్రాథమిక సమ్మేళనం స్థాయికి ఎదుగుతుంది. సమాజానికి ప్రవేశానికి వీలుగా ఉండి, సమాజంతో అన్యోన్య సంబంధం కలిగి ఉంటుంది. చైనా అనుభవం ఈ విషయాన్నే రుజువు చేస్తున్నది.

కుటుంబంలో ముసలి వాళ్ళది ఎప్పుడూ సమస్య కాలేదు. ఎవరి ముసలి తల్లిదండ్రుల ఆలనా పాలనా వాళ్ళే చూసుకోవాలని వివాహ చట్టంలో నియమం విధించారు. నిజానికి ముసలి వాళ్ళందరికీ వాళ్ళ ఇదివరకటి సంపాదనలో 80 శాతం పెన్షన్ దొరుకుతుంది. కనుక ఆర్థికంగా వాళ్ళు ఎవరిమీదా ఆధారపడవలసిన అవసరం ఉండదు. ఇలాంటి వృద్ధులు వ్యా వృత్తిగా శిశు సంరక్షణ కేంద్రాలలో, కమ్యూన్లలో- పాఠశాలల్లో గొప్ప పాత్రలు నిర్వహిస్తున్నారు. కొంత మంది ఆ వయసులో కూడా చదువు నేర్చుకుంటున్నారు. మామూలు మాటల్లో వాళ్ళు చేసే పని అనుత్పాదకమైనదయినా సమాజానికి అది చాలా ఉపయోగపడింది. వృద్ధ విశ్రాంతి గృహాల్లో ఉండే అనాథ వృద్ధులు కూడా ఉన్నారు కాని చాలా తక్కువ. "లాభం ఆధారంగా సమాజం నడవనప్పుడు, ఉత్పాదకతను లాభ సంపాదన విధిగా చూడనప్పుడు ఆ సమాజానికీ, ఆ సమాజంలో అంతవరకు అనుత్పాదక సభ్యులుగా ఉన్న వాళ్ళకూ మధ్య సంబంధాలు మౌలికంగా మారిపోతాయి."

ఇక పిల్లల్ని కనడం విషయంలో స్త్రీకి పూర్తి స్వాతంత్ర్యం ఉంది. స్త్రీలకు గర్భ నిరోధపద్ధతులు వాడే హక్కుంది. గర్భవిచ్ఛిత్తి (అబార్షన్) కూడా పూర్తిగా స్త్రీ ఇష్టం మీద ఆధారపడి ఉంది. గర్భనిరోధం అయినా, గర్భ విచ్ఛిత్తి అయినా నిజానికి ప్రకృతి ధర్మం మీద మానవ సమాజం సాధించిన విజయాలు. అయితే

దోపిడీ, వర్గ సమాజం బాధ్యతా రహితంగా, స్త్రీ ఆరోగ్యంతో సంబంధం లేకుండా స్త్రీ ఆరోగ్యాన్ని నష్టపరుస్తూ ఈ విజయాల్ని దుర్వినియోగం చేసింది. సోషలిస్టు సమాజంలో మాత్రమే స్త్రీ ఈ విజయాల్ని తన ఇష్టానుసారం, బాధ్యతాయుతంగా వాడుకోగలదు. ఈ విజయాల్ని వినియోగించుకుని స్త్రీ సమాజంలో ఎక్కువగా పాల్గొనగలదు. తన విముక్తి లక్ష్యంపైపు ప్రయాణాన్ని మరింత శక్తివంతంగా, దృఢంగా కొనసాగించగలదు

ఐదవది, స్త్రీ పురుష లైంగిక సంబంధాలు. స్త్రీ పురుషులమధ్య లైంగిక సంబంధాలు తప్పనిసరిగా ఆయా సమాజాల సాధారణ లక్ష్యంమీదనే ఆధారపడి ఉంటాయి అసలు లైంగికత్వం సహజ అవసరమా, సాంస్కృతిక అవసరమా అని క్లాడీబ్రియెల్ వివరంగా చర్చించింది అవి అనిర్దిష్టంగా సహజ అవసరాలు కాజాలవని, అలా అయ్యేట్టయితే బానిస, భూస్వామ్య, పెట్టుబడిదారీ, సోషలిస్టు సమాజాలలో వేరువేరు పునాదులమీద తలెత్తిన వేరువేరు లైంగిక సంబంధాలు సవ్యమైనవేనని ఒప్పుకోవాలని ఆమెవాదిస్తుంది. అందుకని ఒక సరుకు ముందు మార్కెట్ను సృష్టించుకుని ఆ తర్వాత ప్రవేశిస్తుందనే మార్క్స్ సూత్రీకరణను సరుకుగా మారిపోయిన లైంగికత్వానికి కూడా అన్వయించి, ఇవాల్టి సమాజంలో లైంగిక సంబంధాలు సాంస్కృతిక అవసరంగా మాత్రమే ఉన్నాయని ఆమె అంటుంది.

ఏ సమాజంలో శ్రమ విభజన అంతరం ఎక్కువగా ఉంటుందో, ఎక్కడయితే ఎక్కువ మందిలో సృజనాత్మకత ఉండదో, ఎక్కడయితే శ్రమను డబ్బుతో తప్ప కొలవలేమో అక్కడ లైంగికసంబంధాలు మనిషికి బాధలనుంచి తాత్కాలిక ఉపశమనం కలిగించే సాధనాలుగా, సాంస్కృతిక అవసరాలుగా కనిపిస్తాయని ఆమె అంటుంది. అంటే పెట్టుబడిదారీ విధానం ఒక సహజ వాంఛను విశ్రాంతి సాధనంగా మార్చివేసి, తద్వారా దాన్నే డబ్బు సంపాదించే సాధనంగా కూడా మార్చివేసింది. సమాజం మనుషుల మీద పైనుంచి రుద్దుతున్న ఈ సంబంధాలు మానవ సంబంధాలుగా కాక అచ్చంగా మారకపు విలువను కలిగి వున్నాయి. మరి అవి సహజంగా ఎప్పుడు రూపొందుతాయి? ఎప్పుడయితే స్త్రీ పురుషుల మధ్య శారీరక భేదాలు తప్ప మరే అసమానతలు ఉండవో, ఎప్పుడైతే మనిషికి ఒక భ్రమాజనిత ఉపశమనాన్ని వెతుక్కునే అవసరం ఉండదో, ఎప్పుడైతే స్త్రీ లైంగిక అణచివేత నుంచి విముక్తి పొందుతుందో అప్పుడు ఈ అవసరాలలోని సహజత్వం మాత్రమే మిగులుతుంది.

పెట్టుబడిదారీ సమాజంలో పెళ్ళి రెండు కారణాలవల్ల అభివృద్ధి నిరోధక మైనది. మొదటిది భార్య భర్తమీద ఆర్థికంగా ఆధారపడవలసి రావడం, రెండవది పెళ్ళి బంధాన్ని తెంచుకోవడం అసాధ్యం, లేదా కష్టసాధ్యం కావడం, ఈ రెండో కారణాన్ని చూసి దానికి పరిష్కారంగా చాలమంది స్వచ్ఛంద సహజీవనాన్ని ప్రతిపాదిస్తున్నారు. ఐతే స్వచ్ఛంద నిర్ణయానికీ, స్వేచ్ఛకూ అవకాశమిచ్చేది ఆర్థిక స్వాతంత్ర్యమే. కాని అది మాత్రమే సరిపోదు స్వచ్ఛంద సహజీవనం లైంగిక సమానత్వంతో, కుటుంబపు ఆర్థిక విధుల విధ్వంసంతో, పెద్దలకూ పిల్లలకూ మధ్య సంబంధాల మార్పుతో కలగలిసి వచ్చినప్పుడు మాత్రమే అది నిజమైన అభివృద్ధిని సాధించగలుగుతుంది.

ఈ మార్పులేవీ లేకుండా స్వచ్ఛంద సహజీవనాన్ని అంగీకరించడంతో సోవియట్ యూనియన్‌లో తొలిరోజుల్లో స్వచ్ఛంద సహజీవనమే ఎలా స్త్రీలకు దుష్ప్రయోజనాలు కలగజేసిందో క్లాడీ బ్రాయెల్ వివరించారు స్త్రీల తక్కువస్థాయి నుంచి తప్పించుకోని సమాజంలో ఈ రకమైన చట్టపరమైన సమానతను పటిష్టం చేయడానికీ ఉపయోగపడుతుంది. ఈ రకంగా పురుషులు ఒక కొత్తరకమైన, చట్టబద్ధమైన బహు భార్యాత్వాన్ని అనుభవించగలిగారు వ్యవసాయ పనులయిపోగానే గర్భంరాగానే విడాకులు కోరుతూ భర్తలు పెట్టుకున్న దరఖాస్తులు సోవియట్ కోర్టుల్లోకి కుప్పలుగా వచ్చిపడ్డాయి.

కాని జంట వివాహాన్నే ఏకైక వివాహ రూపంగా గుర్తించి, వివాహేతర లైంగిక సంబంధాలను నిషేధించిన చైనా వివాహ పద్ధతే నిజమైన స్వచ్ఛంద సహజీవనం వైపు ప్రయాణిస్తున్నదని క్లాడీ బ్రాయెల్ అంటుంది ఎందుకంటే మొదట అక్కడ స్వచ్ఛంద సహజీవనానికి అవసరమైన పరిస్థితుల్ని సృష్టించడం ప్రారంభించారు ఐతే ఒక సంధి దశలో చట్టబద్ధం చేయవలసివచ్చినా, ఆ తర్వాత చేయకపోయినా ముఖ్యం ఇద్దరు స్త్రీ పురుషులు ఒకరినొకరు అవగాహన చేసుకుని సహజీవనం చెయ్యడమే. ఈ సహజీవనం దాని పూర్తి వికాసాన్ని పొందాలంటే పైన చెప్పిన ఐదు అంశాలలోనూ స్త్రీ పురుష సమానత్వం రావాలి. ఈ షరతు పూర్తయిన నాడే స్త్రీ పురుష సహజీవనం గొప్ప సంతృప్తితో నిండి ఉండి, సమాజ సర్వతో ముఖ వికాసానికి దోహదం చేస్తుంది.

చైనా ఈ మార్గంలో కొంతదూరం నడిచింది. ఐతే ఈ సహజీవనం అసాధ్యమనుకున్న పక్షంలో విడాకులు పొందడానికి స్త్రీ పురుషులిద్దరికీ సమాన హక్కుంది. అట్లాగే సాధారణంగా వయసు మీరాక పెళ్ళిచేసుకొమ్మని, అనుభవజ్ఞులు కావడం ద్వారా సహజీవనం కుదురుతుందో లేదో ముందే తేల్చుకొమ్మని కూడా ప్రచారం చేస్తున్నారు.

మొత్తంమీద "ఒక నూతన, విప్లవ లైంగికనీతి, లైంగికత్వంలో, ప్రేమలో కుటుంబంలో శ్రామికవర్గ దృక్పథం వర్గపోరాట ఆచరణలో మాత్రమే క్రమబద్ధంగా (సరళ రేఖలో కానప్పటికీ) నిర్మించడం సాధ్యం. స్త్రీని బానిసను చేసిన ప్రాచీన సాంప్రదాయాలకు, అభివృద్ధి నిరోధక విధులకు వ్యతిరేకంగా విప్లవోద్యమంలో మాత్రమే అది సాధ్యం"

ఈ మూడు పుస్తకాలు కూడా చైనా మహిళా ఉద్యమాన్ని దాని వివిధ కోణాల నుంచి చర్చిస్తాయి తప్ప ఆ ఉద్యమ నిర్మాణాన్ని అంత ప్రముఖంగా చర్చించవు. ఉదాహరణకు క్లాడీ బ్రాయెల్ అసలు నిర్మాణం గురించి ఎత్తుకోనేలేదు. ఐతే విముక్తి స్థావరాలనాటి నుంచే పార్టీ మహిళా సంఘాలు ఏర్పాటు చేయడం మొదలు పెట్టింది. 1949లో అఖిల చైనా ప్రజాస్వామిక మహిళా సమాఖ్య ఏర్పడింది. నిర్మాణపరంగా అంత పటిష్టంకాని ఈ సమాఖ్య తర్వాతి రెండున్నర దశాబ్దాలలో రెండు మహాసభలు మాత్రమే జరుపుకుంది, ఐతే చైనాలో అన్ని సంస్థలకూ ఇది సాధారణ లక్షణమే. ఆయా సంస్థలను ఉద్యమాలతో తప్ప నిర్మాణాలతో గుర్తించడం అసమగ్రమే అవుతుంది.

చైనా మహిళా ఉద్యమం కూడా మిగతా అన్ని రంగాలలాగే లీషావ్‌చీ, లిన్‌పియావో వంటి ముఖ్యమైన ప్రమాదాలకూ, ఇతర చిన్న చిన్న ప్రమాదాలకూ లోనయింది. ఆ జయాపజయాల ప్రయాణాన్ని 1976 వరకు కొనసాగించిన చైనామహిళా ఉద్యమం ఆ తర్వాత దాదాపు అంతరించినట్టే. టెంగ్‌సియావోపింగ్ నాయకత్వంలో రివిజనిస్టు పార్టీగా మారిన చైనా కమ్యూనిస్టు పార్టీ కమ్యూన్లను రద్దుచేసింది. ఉత్పత్తిలో స్త్రీ భాగస్వామ్యాన్ని తగ్గించింది. చిన్నతరహా వ్యవసాయాన్ని, కుటీర పరిశ్రమనూ ప్రోత్సహించింది. విద్యా విధానాన్ని మార్చివేసింది. అంటే సామాజిక

శ్రమలో స్త్రీ పురుష అంతరాన్ని పెంచింది. ఇంటిపనిని పూర్తి కుటుంబ బాధ్యతగా స్త్రీ బాధ్యతగా మార్చింది. పిల్లల పెంపకాన్ని, విద్యనూ మళ్ళీ అభివృద్ధి నిరోధక పద్ధతులలోకి నెట్టింది. కుటుంబాన్ని స్త్రీ పురుష అసమానతతో పటిష్ఠం చేసింది. లైంగిక సంబంధాలలో ఒకవైపు కన్‌ఫ్యూషియస్ భావజాలమైన స్త్రీ లొంగుబాటు తనాన్ని ప్రబోధించింది. మరోవైపు సామ్రాజ్యవాద సంస్కృతికి తలుపులు తెరచి విశృంఖలత్వాన్ని పెంచి పోషించింది.

చైనా మహిళా ఉద్యమ పరాజయానికి ఒక్క ఉదాహరణ చెప్పాలంటే, ఒకప్పుడు ప్రామాణిక మార్క్సిస్టు లెనినిస్టు పత్రికగా ఉండిన పెకింగ్ రివ్యూ (ఇప్పటి బీజింగ్ రివ్యూ) ప్రతి వారమూ టెన్నిస్‌బంతుల నుంచి సైకిళ్ళ వరకూ అన్ని సరుకు ప్రకటనలకూ అర్ధనగ్న స్త్రీలనే వాడుకుంటున్నది.

చైనా మహిళా ఉద్యమం నుంచి తీసుకోదగిన ప్రధాన పాఠం ఇదే. మహిళా ఉద్యమం విప్లవోద్యమంతో పాటే ముందుకూ నడిచింది. విప్లవోద్యమంతో పాటే వెనుకకూ నడిచింది. ఒక చైనా మహిళా ఉద్యమ నాయకురాలన్నట్టు విప్లవోద్యమపు ప్రతి అడుగూ మహిళా ఉద్యమాన్ని ఒక అడుగు ముందుకు నడిపించింది. విప్లవోద్యమానికీ, మహిళా ఉద్యమానికీ ఉండవలసిన, ఉండగలిగిన ఈ గతితార్కిక అన్యోన్య సంబంధాన్నే గుర్తించవలసి ఉంది.

ఉపకరించిన పుస్తకాలు :

1. క్లాడీ బ్రాయెల్ - విమెన్స్ లిబరేషన్ ఇన్ చైనా (ది హార్వెస్టర్ ప్రెస్, ఇంగ్లండ్) 1977
2. డెలియా డేవిన్ - వుమన్ - వర్క్, విమెన్ అండ్ ది పార్టీ ఇన్ రెవల్యూషనరీ చైనా (ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్) 1979
3. ఎలిజబెత్ క్రాల్ - ది విమెన్స్ మూవ్‌మెంట్ ఇన్ చైనా ఎ సెలక్షన్ ఆఫ్ రీడింగ్స్ (ఆంగ్లో చైనీస్ ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూట్) 1974

సాధారణ సమాచారం కోసం జాక్ బెల్డెన్, ఎడ్గార్ స్నో, హాన్ సూయిన్, ఫ్రింజ్ షర్మన్ పుస్తకాలు.

మానవతా విలాపాలు :

# రాజవ్వ నుంచి సత్తెమ్మదాకా...

రత్నమాల



"భూములు భూస్వాముల గుప్పెట్లో ఉండాలి. దున్నేవాళ్ళకి ఫలితం దక్క కూడదు. భూస్వాముల ఇష్టప్రకారమే వ్యవసాయం సాగాలి. భూస్వాములు వద్దనుకుంటేచాలు, ప్రజల అవసరాలతో సంబంధం లేకుండా వ్యవసాయంఆగిపోవాలి. "ఇదీ పాలకుల న్యాయం. ఈ న్యాయం అమలుచేయ దానికి పోలీసులు ఊళ్ళమీదపడి "లం... వ్యవసాయం బందుబెట్టం పెజేస్తారు?" అంటూ ప్రజల్ని హింసిస్తారు. ఇంట్లో బోళ్ల బొచ్చెలు గిన్నెలు సామాన్లు ధ్వంసం చేస్తారు. ధాన్యంగింజలు నాశనం చేస్తారు. స్త్రీలపై లైంగికబలత్కారం జరుపుతారు. మొత్తం గ్రామాల్లో ఖాకీభీభత్సం సృష్టిస్తారు.

1978 అక్టోబర్ 20న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కరీంనగర్ జిల్లాలో సిరిసిల్ల జగిత్యాల తాలూకాలను భూస్వాముల 'భద్రత' కోసం 'కల్లోలిత ప్రాంతాలు'గా ప్రకటించింది. ఆ ప్రకటన తర్వాత తొమ్మిది రోజులకు, అంటే అక్టోబర్ 29న సిరిసిల్లతాలూకా కొదురుపాక గ్రామ మహిళాసంఘం కార్యకర్తలు రాజవ్వ, బొజవ్వ, కనకవ్వల ఇళ్ళమీద కొదురుపాక భూస్వామి గూండాలు దాడి చేశారు. బొజవ్వ, కనకవ్వలు ఇంట్లో దొరకలేదు. భర్తను గుంజకు కట్టేసి కొట్టి, యాభై ఏళ్ళ రాజవ్వపై ఏడుగురు గూండాలు లైంగిక బలత్కారం జరిపారు. స్పృహ కోల్పోయిన రాజవ్వను పొలాల్లో వదిలేసిపోయారు. ఆరు సంవత్సరాల సుదీర్ఘ విచారణ తర్వాత కోర్టు ఇటీవలే ఈ నేరస్తులను శిక్షించకుండానే రాజవ్వ పెట్టిన కేసును మూసివేసింది. 1985 జనవరి 13 రాత్రి సిరిసిల్ల తాలూకా సముద్ర లింగాపురం గ్రామంపై ఇద్దరు సబ్ ఇన్స్పెక్టర్లు, ఆరుగురు కానిస్టేబుళ్ళు దాడిచేసి సత్తెమ్మపై లైంగిక బలాత్కా-

జరిపారు. ఎవళ్ళైనుంచిని కొట్టారు. ఇళ్ళలోని ధాన్యం, ఇతర ఆహార పదార్థాలు నేలపాలు చేశారు. వంట సామాన్లు, వ్యవసాయ పనిముట్లు ధ్వంసం చేశారు.

ఒక్కరాత్రిలో పోలీసులు ఎంత పాశవిక బీభత్సం సృష్టించారంటే దాడి జరిగిన పదిహేనురోజుల తర్వాత ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, స్త్రీ శక్తి సంఘటనల నిజ నిర్ధారణ బృందం అక్కడికి వెళితే ఇంకా గ్రామం వచ్చి పోయినట్లుగానే ఉంది. మనసు గాయాల మాటటుంచి, శరీరాలపై గాయాలే ఇంకా మానలేదు. పోలీసులు బద్దలు కొట్టిన తలుపులు, ఇళ్ళ కప్పులు ఎక్కి పోలీసులు పీకేసిన పెంకులు, పగిలిన పెంకు ముక్కలు, పగిలిన గాదెలు, కుండలు, విరిగిన వ్యవసాయ పనిముట్లు, నేలపాలయి కలగాపులగమయిన రకరకాల ధాన్యం- ఇదీ ఆ ఊరి దృశ్యం. పోలీసులు ప్రజల్ని వీపులమీదనే కాదు కడుపులమీద కూడా తన్నగలరు, తన్నారు.

ఆరోజు అర్ధరాత్రి గంభీరావుపేట ఎస్ఐ, ముస్తాబాద్ ఎస్ఐ మరి ఆరుగురు పోలీసుకానిస్టేబుళ్లు కరీంనగర్ కు 45-50 కి.మీ. దూరంలో ఉన్న సముద్రలింగాపురం గ్రామంపై దాడి చేశారు. గ్రామంలోకి వచ్చిరావడంతోనే గాంధీవిగ్రహం ఎదురుగా ఉన్నకూరెల్ల నర్సయ్య ఇంటిమీదపడ్డారు. ఆఅర్ధరాత్రివేళ ఆయనను బెదిరించితలుపులు తెరిపించి ఇంట్లో జొరబడ్డారు. ఇంటిల్లిపాదినీ విపరీతంగా కొట్టారు. గాదెలు పగులగొట్టి ధాన్యం నేలమీద పారబోశారు. తెల్లవారితే సంక్రాంతి పండుగ అని పిండి వంటలకోసం కలిపి ఉంచుకున్న గోధుమ పిండిలో కారం కలిపారు. బియ్యంలో కిరసనాయిలు కుమ్మరించారు. గిన్నెలు, చెంబులు, బిందెలు, బండకేసి కొట్టి పగులగొట్టారు. నాగలి విరగ్గొట్టారు.

అక్కడినుంచి రైతు కూలి సంఘం కార్యకర్త రాజిరెడ్డి ఇంటికి పోయారు. కొంతకాలంగా పోలీసు కేసులు, దాడుల మూలంగా ఆయన ఊళ్లో ఉండటం లేదు. ఐనా పోలీసులు తలుపులు బాది తెరవమన్నారు. పోలీసుల భాషలో 'అనడం మాట్లాడడం' అంటే బూతులు తిట్టడం అని. "రాజిరెడ్డి ఇంట్ల లేడు. ఈ దొంగరాత్రి తలుపు తియ్య. మీరేదైన అడిగేదుంటె పొద్దున రాండ్రి" అంది రాజిరెడ్డి భార్య సత్తెమ్మ. ఆమె వయసు 30-32 సంవత్సరాలు. ఆమె చెప్పేది వినిపించుకోదలుచుకోని పోలీసులు ఓ పెద్ద బండరాయితో తలుపులు బద్దలు గొట్టారు. ఇంట్లో జొరబడి నానా బీభత్సం సృష్టించారు.

స్త్రీలను రాత్రిపూట అరెస్టు చేయగూడదు. సూర్యోదయానికి ముందుగాని, సూర్యాస్తమయం తర్వాతగాని స్త్రీలను ఇంటరాగేషన్ చేయగూడదు — ఇవి లైంగిక బలాత్కార చట్టం (రేప్‌లా) లో ఇటీవల చేసిన సవరణలు. బహుశా ఇవి పోలీసులకు తెలియవు. తెలిసినా వాళ్ళదారి వాళ్ళది, చట్టం దారి చట్టానిది. ప్రజలను అణచేవిషయంలో వాళ్ళు దేన్నీ లెక్కచేయరు. కనుకనే తలుపులు బద్దలుకొట్టి లోపలికి వెళ్ళిన పోలీసులు బండబూతులు తిడుతూ చేతికందిన దాన్నల్లా విసిరి కొట్టారు. సత్తెమ్మను, ఆమె కొడుకులు మల్లారెడ్డి (వయసు 15), దేవిరెడ్డి (వయసు 12) లను విపరీతంగా కొట్టారు. గాదెలు పగులగొట్టి ధాన్యం చిందరవందరగా నేలమీద కాళ్ళతో చిమ్మారు కుండలో దాచిన భూమిపట్టా కాగితాలు వెతుక్కొచ్చి "లం.... వ్యవసాయం బందు బెట్టమంటె జేస్తావు.... నిన్ను...." అని బూతులు తిడుతూ, ఆ కాగితాలు చింపి పోశారు. పిల్లల్ని, సత్తెమ్మను లాఠీలతో, తుపాకి మడమలతో బాగా కొట్టి అటకమీదినుంచి రెండు ఖాళీ గుమ్ముల్ని కింద పడేసి పిల్లలిద్దర్నీ చెరో ఇద్దరు చొప్పున నలుగురు కానిస్టేబుళ్ళు గుమ్ముల చాటుకు పట్టుకొని కూచున్నారు ఇద్దరు ఎస్‌ఐలు సత్తెమ్మను కొడుతూ, బూతులు తిడుతూ లైంగిక బలత్కారం జరిపారు. ముందు పిల్లిగడ్డం ఉన్న ఎస్‌ఐ మొహానికి గుడ్డ అడ్డంపెట్టుకుంటే సత్తెమ్మకు గడ్డం మాత్రం కనిపించింది. ఆ తర్వాత ఆమె స్పృహతప్పి పడిపోయింది తన మీద ఎంతమంది లైంగిక బలాత్కారం జరిపారో ఆమెకు తెలియదు గుమ్ముల చాటు నుంచి పిల్లలు తిట్లు, దెబ్బలు, తల్లిబాధతో అరవడం విన్నారు "మేం చూస్తుండగాని మా అమ్మను ఖరాబు చేసిండ్రు" అని చెప్పారు.

గతంలో రాజవ్వ కేసులో కేసు పెట్టడానికి పోలీసు స్టేషన్‌కు వెళ్ళిన ఆమె కొడుకుతో పోలీసులు "చెరుచుడేందిరా, ఖరాబుజేసుడేందిరా, చెప్పు ఎట్ల జేస్తరో" అని అవమానించారు.

సత్తెమ్మకు స్పృహ వచ్చేసరికి పోలీసులు వెళ్ళిపోయారు. దౌర్జన్య లైంగిక చర్య వల్ల ఆమెకు విపరీతంగా రక్తస్రావం అయింది. డాక్టర్ మందులు ఇచ్చి. వాదేవరకూ మూడురోజులపాటు అలా రక్తస్రావం అవుతూనే ఉంది. తెల్లవారికాక మర్నాడు ఊరి సర్పంచ్ ఆమెను డాక్టర్ దగ్గరికి తీసుకువెళ్ళాడు పోలీసులు రిజిస్టర్ చేసి తెచ్చిన కేసు కాదుగనుక పరీక్ష చేయనని డాక్టర్ నిరాకరించింది నేరస్తులు

తను నేరం రిజిస్టర్ చేయాల్సి ఉంటుందని అనుకోలేదు. పన్నెండుగంటలలోపు పరీక్ష చేయకపోతే దౌర్జన్యం జరిగిన ఆధారాలుండవు. పైగా అప్పటికే, తెలియనితనంతో సత్తెమ్మ స్నానం చేసేసింది. అత్యాచారం జరిగి 36 గంటలు దాటింది. ఐనా, ఒక పక్క రక్తస్రావం జరుగుతున్నా పరీక్షించడానికి డాక్టర్ మొండిగా నిరాకరించింది.

ఎక్కువలో ఎక్కువగా డాక్టర్ నోటినుంచి వచ్చిన మాట "పోలీసులు అట్లా చేయరు గదమ్మా" అనేది. ఈ మధ్య తరగతి మనస్తత్వం ముందు వర్గ న్యాయమే. తప్ప 'సహోదరిత్వం' మిగలదు. తాత్కాలిక ఉపశమనంగా డాక్టరు రాసిచ్చిన మందులు తప్ప ఏమీ దక్కలేదు నిజానికి లైంగిక బలాత్కారం జరిగినప్పుడు జరపాల్సిన వైద్య పరీక్షలేవీ జరపనేలేదు. పైగా లైంగిక బలాత్కారం జరిపిన పోలీసులు నమోదు చేసేవరకూ పరీక్ష జరపగూడదనే నియమం. తమమీద తామే పోలీసులు కేసు నమోదు చేసుకుంటారా అనే గ్రామస్తుల ప్రశ్నకి జవాబు. చట్టాలు ప్రజల క్షేమానికికాదు, చట్టాలను అమలుపరచవలసిన యంత్రాంగం ప్రజలకు చుట్టాలుకారు.

సత్తెమ్మ ఇంటి నుంచి వెళ్తూ పోలీసులు దారిలో ఊరిబైట ఉప్పరి వాడ మీద పడ్డారు. ఈ వాడలో ఎక్కువ మంది మగవాళ్ళు పనుల కోసం బొంబాయికో, మద్రాసుకో వలస వెళతారు. సంవత్సరంలో ఒకటి రెండుసార్లు మాత్రమే ఇళ్ళకు వస్తారు అందుకని ఈవాడలో మగవాళ్ళ కంటె ఆడవాళ్ళు ఎక్కువ మంది ఉంటారు. పోలీసులు కస్మ ఎల్లయ్య అనే వ్యక్తికోసం ఈ వాడకు వెళ్ళారు. అయితే ఆవాడలోనే మరో ఎల్లయ్య – తుమ్మల ఎల్లయ్య – ఉన్నాడు. ఎల్లయ్య అనే పేరున్న నేలానికి పోలీసులు ఆయనింటికి వెళ్ళారు. అతని భార్య బాలవ్వను "లం....నీ మొగని పేరేందే" అని లాఠీతో అడిగారు. "ఎల్లయ్య బాంచన్" అని బాలవ్వ చెప్పగానే "లం.... నీ మొగడు పార్టీలో ఉన్నాడే? ఏడబోయిండే వాడు?" అని అడుగుతూ బాలవ్వను కొట్టారు. ఇంట్లో ఉన్న ఎల్లయ్య కొడుకును కొట్టుకుంటూ పొలం దగ్గర కావలి పడుకున్న ఎల్లయ్యదగ్గరికి తీసుకపోయారు. అక్కడ టార్చివేసి చూసి వాళ్ళు వెతుకుతున్న ఎల్లయ్య ఇతను కాదని తెలిసికూడా కొట్టారు. ఎల్లయ్య కొడుకు గడియారం లాక్కపోయారు. ఇంకా చాల ఇళ్ళలో గడియారాలు డబ్బులు ఎత్తుకపోయారు.

బొలం దగ్గరి నుంచి పోలీసులు మళ్ళీ ఉప్పరి వాడకు వెళ్ళారు. ఈ సారి కమ్మరి ఎల్లమ్మ ఇల్లు దొరక బట్టుకున్నారు. కమ్మరి ఎల్లయ్య మద్రాసులో పని చేస్తు న్నాడు. ఎల్లయ్య భార్య ఒంటరిగా ఉంటుంది గాని ఆరోజు ఇంట్లోలేదు. ఇంటికి తాళం ఉండడంతో పోలీసులు కోపంతో ఇల్లెక్కి పెంకలు ఊడదీసి కిందవేసి పగుల గొట్టారు. తలుపులు పగులగొట్టి ఇంట్లో జొరబడి ధాన్యం గాదెలు పగులగొట్టి గింజలు నేలమీద పోసి చిందర వందర చేశారు. పళ్ళాలు, చెంబులు, బిందెలు బండకు వేసి బాది పగుల గొట్టారు. కొట్టడానికి ఆ ఇంట్లో మనుషులు లేకపోవడంతో కేవలం పక్కిల్లు అయిన పాపానికి గంగవ్వ ఇంట్లో జొరబడ్డారు. గంగవ్వ పచ్చి బాలెంత, రెండు నెలల పసిపాప తల్లి. ఆమెను స్పృహ తప్పేంతగా కొట్టారు. మద్రాసు రేవులో పనిచేసే ఆమె భర్త లేడు, స్పృహలేని స్థితిలో గంగవ్వను బంధు వులు మర్నాడు కరీంనగర్ ఆస్పత్రిలో చేర్పించారు. అక్కడ్నించి నిజామాబాద్ ఆస్పత్రికి మారిందని ఇంకా కోలుకోలేదని ఊరివాళ్ళు చెప్పారు.

కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించిన నాటినుంచి ఈ రకమైన భీభత్సం పోలీ సుల దినచర్యలో భాగమైంది. కల్లోలిత ప్రాంతంగా ప్రకటించకముందు ఈ తాలూ కాల్లో వెట్టికి, ఆర్థిక, సాంఘిక, రాజకీయ, లైంగిక దోపిడీకి తలవంచని ప్రజల మీద భూస్వాములు స్వయంగా తమ గూండాలచేత దౌర్జన్యం చేయించేవారు. గ్రామాలలో భయ భీతావహం సృష్టించేవారు. ఈ గూండాల్ని భూస్వాములు తమ ఖర్చుతో భరించాల్సి వచ్చేది. "ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వం ఖజానా" నుంచి జీతాలు తీసుకుంటూ పోలీసులు చేస్తున్నది ఆదేపని.

సిరిసిల్ల తాలూకాలో వేలాదిఎకరాల భూస్వాములున్నారు దేశంలో, రాష్ట్రంలో ఏ పార్టీ అధికారమున్నది అనేదానితో సంబంధం లేకుండా ఇక్కడి గ్రామాల్లో అమ లయ్యే ఏలుబడి భూస్వాములదే. చట్టానికి చిక్కకుండా ఉన్న భూములు అలాఉంచి పట్టా లెక్కల్లోకి వచ్చేవే 100 ఎకరాల నుంచి వేల ఎకరాల వరకు ఉన్న భూస్వామ్య కుటుంబాలు 24. ఇక్కడ పేరుకు ప్రభుత్వాధికారులెవరయినా ఆర్థిక, సాంఘిక, రాజకీయ అధికారం భూస్వాములదే. ప్రజలమీద భూస్వాములు సాగిస్తున్న ఆర్థిక, సాంఘిక, రాజకీయదోపిడీ, అణచివేతలతోపాటు స్త్రీలమీద అదనంగా లైంగికదోపిడీ, అణచివేత కొనసాగుతూ వస్తున్నది. 1970-72 లలో రైతుకూలి సంఘాల విస్తరణ

క్రమంలో ప్రజల్లో ఏర్పడుతున్న చైతన్యం అన్ని దోపిడీ అణచివేతలతోపాటు లైంగిక దోపిడీ అణచివేతలను గుర్తించడంతో (అంతకుముందు వ్యక్తిగత నిరసన పోరాటం ఉన్నప్పటికీ సామూహిక చైతన్య స్థాయిలో లేదు) లైంగిక లొంగుబాటు అర్థం లైంగిక అణచివేత అయింది. అన్ని అణచివేతలను ప్రతిఘటించడం నేర్చుకున్న ప్రజలు ఈ లైంగిక అణచివేతను సంఘటితంగా ప్రతిఘటించడం ప్రారంభించారు. "తెల్లదొర"గా పేరుపడ్డ బోయినపల్లి భూస్వామి ప్రభాకరరావు కనపడ్డ స్త్రీనల్లా వదలకుండా బలాత్కరిస్తూ లైంగిక అత్యాచారాలకు పేరుగాంచినవాడు. చాకలి దేవమ్మను లొంగదీసుకొని, భర్త దేవయ్యకు విడాకులిప్పించి, కొన్నాళ్ళకు మళ్ళీ దేవమ్మను దేవయ్య దగ్గరికే పంపి, మళ్ళీ బలత్కారం జరపగా ఎదురు తిరిగిన దేవయ్యను 1978 జూన్ 30న రక్తం కక్కుకునేట్టు కొట్టి మర్నాడు ఎర్రటి ఎండలో ఇసుకవాగులో స్పృహలేని స్థితిలో కాకులకు గద్దలకు పడేయించాడు. ఈ ఘోరం తెలిసిన చుట్టుపట్ల గ్రామాల ప్రజలు బోయినపల్లి వచ్చి ప్రభాకరరావును పట్టుకొని రచ్చబండ దగ్గర నిలబెట్టి చెప్పుల దండలువేసి, చీపుర్లతో కొట్టారు అయినా కోపం చల్లారని స్త్రీలు "తెల్లదొర" మెడనిండా చెప్పులువేసి, వేలాదిమంది ప్రజలతో చుట్టుపట్ల 5 గ్రామాలలో ఊరేగించారు.

ఈ సంఘటన తర్వాత ఎన్నో గ్రామాల్లో ప్రజలు, ముఖ్యంగా స్త్రీలు తమ మీద సాగుతున్న లైంగిక అణచివేతను ప్రతిఘటించారు. ఈ క్రమంలో చాల గ్రామాల్లో మహిళా సంఘాలు ఏర్పడ్డాయి. అప్పుడప్పుడే ఏర్పడుతున్న మహిళా సంఘాల ఉనికిని దెబ్బదీయడంలో భాగంగానే కొదురుపాక రాజవ్వపై బలాత్కారం జరిపారు.

ఆ తర్వాతకాలంలో జిల్లాలో ప్రజలను అణచడంలో భూస్వాములకు అండగా ముందుకొచ్చిన మత తత్వ వాదులు పద్మ అనే విప్లవ విద్యార్థినిని ఇంటిమీద దాడి చేసి ఎత్తుకుపోయి మూడురోజులపాటు చిత్రహింసలు పెట్టారు. ప్రజా సంఘాలు, సంస్థల దృష్టికి వచ్చినవి ఇవి కాగా రానివి ఎన్ని ఉన్నాయో ... ఇప్పుడు పోలీసులే బలాత్కార లైంగిక దౌర్జన్యాలు జరపడం మొదలయింది ఈ సమయంలో ప్రజా ప్రతిఘటనలో ప్రజాస్వామిక సంస్థలు, ముఖ్యంగా స్త్రీల సంఘాలు భాగం పంచుకుని ఈ ఘటనపై తీవ్రంగా స్పందించకపోయినట్లయితే తమ చారిత్రిక బాధ్యతను విస్మరించడమే అవుతుంది.

నిజానికి రమీజాబీ కేసు, మథుర కేసుల సందర్భంగా దేశంలో మహిళా సంఘాలు పెద్దఎత్తున కదిలి కొంతకాలంపాటు ఉద్యమించి రేప్‌లా ను సవరించే పరిస్థితిని కల్పించాయి. మథుర కేసులో సెషన్స్ కోర్టు శిక్ష విధించిన నలుగురు పోలీసులు నిర్దోషులని సుప్రీంకోర్టు ఇచ్చినతీర్పు సరైనదికాదని, తిరిగి కేసువిచారించాలని 1979 అక్టోబరులో నలుగురు న్యాయవాదులు, ఉపాధ్యాయులు ప్రధాన న్యాయ మూర్తికి లేఖ రాశారు. దీనికి ప్రతిస్పందనగా 1980 మార్చి నుంచి దేశంలో దాదాపు 40 – 50 వివిధ మహిళా సంఘాలు ఒక ఐక్య కార్యాచరణ ప్రారంభించాయి. అప్పటికి 125 సంవత్సరాలుగా ఎలాంటి మార్పు లేకుండా కొనసాగుతున్న రేప్‌లాను సవరించాలని దేశవ్యాప్తంగా ఆందోళన చేపట్టాయి. ఈ ఆందోళన ఫలితంగా 1980 ఏప్రిల్‌లో సవరణలు సిఫారసు చేయవలసిందిగా ప్రభుత్వం లాకమిషన్‌ను కోరింది. వెంటనే లాకమిషన్ తన నివేదికను సమర్పించింది. లాకమిషన్ సిఫారసులే అంతంత మాత్రంగా ఉన్నాయంటే ప్రభుత్వం అందులో కొన్నిటిని తొలగించి కొన్నిటిని మార్చి లైంగిక బలాత్కారానికి సంబంధించిన కొత్త బిల్లును 1980 శీతాకాల సమావేశాల్లో పార్లమెంటులో ప్రవేశపెట్టింది. ఈ బిల్లు దేశవ్యాప్తంగా ఎక్కువ విమర్శనకీ గురయింది మహిళా సంఘాల, ప్రతిపక్షాల నిరసన, వ్యతిరేకతలను అత్యధిక సంఖ్యాబలంతో అధిగమించి 1983 డిసెంబర్‌లో ఈ బిల్లు చట్టం అయింది.

ఈ చట్టం ప్రకారం పోలీసు స్టేషన్లో చేసినా, ఎక్కడ చేసినా పోలీసుల లైంగిక బలాత్కార చర్య అధికార లైంగిక బలాత్కారం కిందికే వస్తుంది. మన రాష్ట్రంలో పౌరహక్కుల సంఘం దృష్టికి వచ్చి, నిజనిర్ధారణ కమిటీలు వెళ్ళి కనుక్కున్న కేసులే, పోలీసు స్టేషన్లలో పోలీసులు జరిపిన లైంగిక బలాత్కార ఘటనలు 1984 లో మొత్తం 6 ఉన్నాయి. దేశంలో అన్ని ప్రాంతాలలోనూ ఇలాంటి ఘటనలు ఉండే ఉంటాయి. చట్టంలో మార్పులు సాధించడానికి జరిగిన కృషి ఆయా ప్రాంతాల్లో ఉన్న సంస్థలు వాటి గురించి కదలడంలో లేకపోవడం (అసలు జరిగినా, జరగకపోయినా బహిర్గతం చేయడానికైనా సరే) ఆ సంస్థల కార్యాచరణ స్థితిని తెలుపుతుంది.

సాధారణంగా జరిగే లైంగిక బలాత్కారాలకు సంబంధించిన ఆందోళనా కార్యక్రమాలు వ్యవస్థలోనూ, చట్టాల్లోనూ, ఉన్న లోపాలను బట్టబయలు చేయడానికి ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి దోహదం చేస్తాయి. కాగా పోరాట ప్రాంతాల్లో జరిగే ఈ ఘటనలపై జరిపే ఆందోళన, ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమాల ద్వారా స్త్రీల సంఘాలిచ్చే మద్దతు స్త్రీ విముక్తి క్రమానికి దోహదమవుతుంది

నడుస్తున్న చరిత్ర :

# ఎఐ ఆర్ ఎస్ ఎఫ్ ప్రయాణం - వరంగల్ అనుభవం

చుక్కాని

ఎన్నెన్నో నిర్బంధాల మధ్య మహాసభలు విజయవంతంగా జరుపుకున్న ఉత్సాహంతో తిరుగు ప్రయాణం కట్టాం. కృష్ణా, విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలవాళ్ళం బయల్దేరిన ఈస్ట్‌కోస్ట్ ఎక్స్‌ప్రెస్ నాలుగో తేదీ ఉదయం సుమారు పదకొండు గంటలకు కాజీపేట చేరింది.

మెల్లమెల్లగా పోలీసులు అన్ని పెట్టెలూ వెతుక్కుంటూ మాపెట్టెకొచ్చి మమ్మల్ని కొడుతూ తీసికెళ్ళారు. స్టేషన్ బైటికి తీసుకెళ్ళి మా బ్యాగ్‌లు వెతికారు. జెండాలు, బ్యానర్లు, కర్రలు, పుస్తకాలూ-కనిపించిందల్లా తీసుకున్నారు, ఒకతన్ని టేప్‌రికార్డర్ ఉందని వేరేగా తీసికెళ్ళిపోయారు మాకు సంబంధంలేనిచోట పెట్టారు. ఆ తర్వాత మమ్మల్ని రైల్వే పోలీస్ స్టేషన్‌లోకి తీసుకెళ్ళి ఆడవాళ్ళనీ మగవాళ్ళనీ వేరుచేసి కూచోబెట్టారు. అక్కడ చిత్తూరు జిల్లా వాళ్లు కూడా కనబడ్డారు

అంతా కలిసి ఆడవాళ్ళం పాతిక మందిమి ఉన్నాం. అందరం ధైర్యంగానే ఉన్నాం. గతంలో అనుభవం నుంచి తెలుసుకున్న దానితో వెళ్ళగానే మేమందరం ఒక నిర్ణయానికి వచ్చాం. వాడు ఎట్లాగూ చెక్‌చేసి అందరిదగ్గరా ఉన్న డబ్బు గుంజుకుంటాడు. అందరం అరెస్టు అవడానికైతే సిద్ధంగానే ఉన్నాం. కాని శత్రువుకి పైసా కూడా దక్కనియ్యగూడదని ఆడవాళ్ళందరం నిర్ణయించుకున్నాం. ఓ ఇద్దరికి అన్ని డబ్బులూ ఇచ్చేసి ఫైన్ కట్టి విడిపించాం. వాళ్ళతో మరో ఇద్దరిని కూడా పంపాల్సి వచ్చింది. ఇక మిగిలినవాళ్ళం అరెస్టు అవ్వడానికి తన్నులు తినడానికి సిద్ధమయ్యాం.

పోలీసులు మమ్మల్ని పచ్చిబూతులు తిట్టడం మొదలెట్టారు. మాకు పెళ్ళిళ్ళు కావని శపించారు. చేసుకుంటే అడవిలో వాళ్ళే మమ్మల్ని చేసుకోవాలని తిట్టారు. చేరక చేరక రాడికల్స్‌లోనే చేరాలా అన్నారు. రాడికల్స్ పెద్దదగాకోరులట, అన్నీ వెధవ పనులు చేస్తారట. వాళ్ళను ఊబిలోకి దించి నాయకులు కోట్లు గడిస్తున్నారట. హైస్కూల్ పిల్లల దగ్గరనయితే ఒక పోలీసు "సుదర్శన్‌ను మేమే చంపినంరా.

మిమ్మల్ని గూడ చంపుతం, జాగ్రత్త" అని బెదిరించాడు. వాళ్ళు అలా భయపెట్టి నీచంగా మాట్లాడి బెదరగొట్టడానికి, స్థైర్యాన్ని దెబ్బదీయడానికి ప్రయత్నించారు. అట్లానే మరోవైపు వాళ్ళ పక్షం చేసుకోవడానికి మర్యాదగా మాట్లాడడం, జోకులు వెయ్యడం కూడా చేశారు. కాని మేమంతా వాళ్ళతో ఏమీ మాట్లాడలేదు.

తర్వాత మా పేర్లు రాసుకున్నారు. స్టేషన్లోని స్వీపర్స్‌ను పిలిపించి మా బట్టలు సోదా చేయించారు. ఆడ పోలీసులు లేరని వీళ్ళను పిలిపించారు. తమ పని కానిది బలవంతాన తమతో చేయిస్తున్నారనీ, మా మీద సానుభూతితోనూ వాళ్ళు పోలీసులను బండబూతులు తిట్టారు. చాలా బాధపడుతూ సోదా చేశారు. ఆ తర్వాత సభలనుంచి మేం తెచ్చుకున్న అన్నం పొట్లాలే పోలీసులు మాకిచ్చారు

మాలో ఐదుగురికి మెడలో పేరు అడ్రసు ఉన్నబోర్డు తగిలించిఫోటోతీసారు. లేదా ఫోటో తీస్తున్నట్లునటించి బెదిరించారు. మళ్ళీ పేర్లు రాస్తున్నారు. ఈసారి ఒకమ్మాయి అడ్రసు చెప్పడంలో తడబడింది. "అబద్ధం చెప్తావుటే, దొంగ ముండా! నేను చెప్పిన గదసార్, ఇది బోర్తెల్ హౌస్ నుంచే వచ్చింది. దీనిఅవతారం చూస్తుంటే తెలియట్లే?! ఏమే ఎక్కడ్నుంచి వచ్చినవు? లాడ్జినుంచేనా? వీళ్ళంతా గింతేసార్" అని కూశాడు. ఇక ఆ అమ్మాయిని విపరీతంగా కొట్టారు. ఆ అమ్మాయి స్పృహ తప్పి పడిపోయింది. మొత్తంమీద పోలీసుల దెబ్బలకు ఇద్దరు స్పృహతప్పి పడిపో యారు లాకప్‌లో ఉన్నంతసేపూ అందరినీ కొడుతూనే ఉన్నారు. ఇద్దరు ముగ్గుర్ని మిగతా వాళ్ళకంటె ఎక్కువగా కొట్టారు. ఆ లాకప్ చిన్న గది, ఇరుగ్గా ఉంది. గాలి ఆడటంలేదు. ఎనిమిదింటివరకూ అక్కడే ఉంచి మేజిస్ట్రేట్ దగ్గరికి తీసుకెళ్లారు.

"ఉన్న డబ్బులన్నీ పోలీసులు లాక్కున్నారు. మా దగ్గర ఏమీ లేవు" అని మేజిస్ట్రేట్‌కు చెప్పాం. "ఈసారికి వదిలేస్తాగాని, ఇక్కడినుండి వెళ్ళేటప్పుడు టికెట్లు కొనుక్కుని వెళ్ళండి" అన్నాడా మేజిస్ట్రేటు. మాదగ్గర డబ్బుల్లేవని మళ్ళీ చెపితే, ఆవేవీ ఆయనకు పట్టవని మళ్ళీ టికెట్లు లేక వెళ్తే మళ్ళీ పట్టుకుంటామని, ఈసారి వదలనని కటువుగా చెప్పాడు. సరే, బైటికెళ్ళినాక ఆలోచించవచ్చులే అను కున్నాం. ఇంతకీ ఆడవాళ్ళనీ, చిన్న పిల్లల్నీ మాత్రం వదిలేసి మిగతా వాళ్ళందరికీ వారం రోజులు జైలు శిక్ష వేశాడు. అంటే బైట ఎవరైతే సమర్థవంతంగా పని చేసి

వెళ్ళలేరని అనుకున్నాడో వాళ్ళని విడుదల చేశాడన్నమాట. ఆడవాళ్ళం, పిల్లలం అలా బైటికొచ్చేశాం.

బైట తెలిసిన కామ్రేడ్స్ కొందరు కనిపించారు. మేమంతా వరంగల్ స్టేషన్ కు వెళ్ళి నరసాపూర్ ఎక్స్‌ప్రెస్ ఎక్కేద్దామని నిశ్చయించుకున్నాం. అందరం కలిసి ఓయూ భైమంది పైనే ఉన్నాం. అందరం కలిసి నడవడం క్షేమంకాదని మూడుబ్యాచీలుగావిభజించుకుని కొంచెం, కొంచెం ఖాళీఇచ్చుకుంటూ అన్నిబ్యాచీలూ కాజీపేటబ్రిడ్జి దగ్గరకలవాలని అనుకున్నాం. అనుకున్నసమయానికి రెండుబ్యాచీలు చేరినయి మరో బ్యాచీకోసం అక్కడ ఓ కామ్రేడ్‌ని ఉంచి మిగతావాళ్ళం వరంగల్ బస్‌స్టాండ్‌దగ్గరి పార్క్‌కు బయల్దేరాం. 'అక్కడ మన కామ్రేడ్స్ ఉంటారు వాళ్ళని కలిసి వాళ్ళతో ఉండండి' అన్నారని తెలిసి అక్కడికి వెళ్ళాం. కాని వరంగల్ వెళ్ళేసరికి అంతా నిర్మానుష్యంగా ఉంది. అందరం గుంపుగా ఉండకుండా చిన్న చిన్న గ్రూప్స్‌గా ఉండి కూచున్నాం. అందరూ మా వైపు అనుమానంగా చూస్తున్నారు. చాలా భయం వేసింది, ఆందోళన కలిగింది.

అంతలో మాలో ఒక కామ్రేడ్ పార్క్‌కి వెళ్ళింది. అక్కడంతా చీకటి చుట్టుపట్ల ఎవరూ లేరు. అది చూసి ఆమెవెనకాల ఎవరో ఇద్దరు పడ్డారు. ఎవరూ, ఎందుకు వచ్చింది అని కూపీ లాగారు. వాళ్ళచూస్తే అచ్చు రౌడీల్లాగా ఉన్నారు. పార్క్‌లోపల మన వాళ్ళెవరూ లేరు. రావాల్సిన మూడో బ్యాచి రాలేదు, ఈ రౌడీలు వెనకాల పడ్డారు. ఏం చెయ్యాలో అర్థం కాలేదు, ఏమీ తోచలేదు. సరే, పిల్లల్లో ఒకర్నిపంపిస్తే నిఘా ఎక్కువ ఉండదు గదా అని ఒకర్ని పంపించాం. ఆ రౌడీలు పిల్లవానివెంటకూడా కొంతదూరం వెళ్ళారట

అక్కడ ఉండవలసిన మావాళ్ళు పోలీసులు రాగానే చెల్లాచెదరయ్యారని, కొందరు స్టేషన్లోకి వెళ్ళారని తర్వాత తెలిసింది. ఒక హైస్కూల్ అబ్బాయిని స్టేషన్‌కు పంపాం. అతను అక్కడ్నుంచి ఓ ఇద్దరు కామ్రేడ్స్‌ను తీసుకొచ్చారు. వాళ్ళు మా కోసం ఎదురుచూస్తూ పార్క్‌లో కూచుంటే వ్యాన్ వచ్చిందని తెలిసి అందరూ పరుగెత్తారట. ఎవరూ కలువ లేదు. ఊళ్ళో 144 సెక్షన్ ఉంది. అమ్మాయిలందరినీ చాల సులభంగా గుర్తు పడుతున్నారు బస్ స్టాండ్‌లో ఉండటం

క్షేమం కాదు. రాత్రిపూట ఎట్లాగూ పోలీసులు పెట్రోలింగ్‌కు వస్తారు. స్టేషన్‌కి వెళ్దామంటే అక్కడా పోలీసు నిఘా ఎక్కువగానే ఉంది. ఉన్నచోట ఉందామంటే పోలీసులేకాక రౌడీలు కూడా.

అన్నిటికంటె కష్టమైనదేమిటంటే ఆ పరిచయంలేని ప్రాంతంలో శత్రువెవరో, మిత్రుడెవరో తెలియకపోవటం. ఇక అక్కడుంటే ఏ క్షణమైనా ఏ ప్రమాదమైనా ముంచుకురావచ్చని, ఇప్పుడు మళ్ళీ అరెస్టు జరిగితే పరిణామాలు తీవ్రంగా ఉంటాయని అక్కడ్నించి తప్పుకుందామనుకున్నాం. ఆలోచించి ఊరిబయట చేలల్లో ఆ రాత్రి గడపాలని నిశ్చయించుకున్నాం. రాత్రిపూట ఊళ్ళో ఉంటే పోలీసుల చేతిలో పడటం ఖాయం. వరంగల్ పోలీసుల గురించి తెలియనిదేముంది? అందుకే బస్టాండ్ నుంచి బయటకు వచ్చి బయలుదేరాం.

కొంతదూరం నడిచాక తుప్పలు కనిపించాయి. అక్కడ లోపలికెళ్తే కొంచెం ఖాళీ స్థలం కనిపించింది. అంతా రాళ్ళ మయం. కొంతమంది కామ్రేడ్స్ చెప్పులు పోయి, ఆ రాళ్ళల్లో చాల ఇబ్బంది పడ్డారు. అక్కడ ఒక గొయ్యిలాగ ఉంది. అక్కడ ఉంటే తెల్లారేవరకు ఎవరికీ కనిపించం. ఆ రాత్రి అక్కడే పడుకున్నాం. కప్పుకోవడానికి కూడా సరిగ్గా ఏమీ లేవు. చలిలో వణుక్కుంటూ అలాగే పడుకున్నాం. ఒకళ్ణి సెంట్రీగా పెట్టుకున్నాం. ఆ కటిక నేలమీద, రాళ్ళమీద కష్టమూ భయమూ మరిచిపోయి అలసట మూలంగా అందరూ నిద్రపోయారు.

ఒక కామ్రేడ్‌ను మూడో బ్యాచి వాళ్ళకోసం పంపించాం. వాళ్ళు దారి తప్పిపోయారట. కాజీపేటలోనే ఉండిపోయారు. వరంగల్‌కు పొద్దుటే వచ్చేస్తామని వాళ్ళు కబురు పంపారు. ఈ సంగతులన్నీ తెలుసుకుని ఆ తుప్పల్లో పడుకుంటే, ఏ వైపు లైటు వెలిగినా, చిన్న శబ్దమైనా, పోలీస్ వ్యానేమోనని భయం, గగుర్పాటు, ఉలికిపాటుతో ఆ రాత్రింతా గడిపేశాం.

మాతో ఉన్న హైస్కూల్ పిల్లలు కూడా అసలేమీ కంప్లెయింట్స్ లేకుండా చాల క్రమశిక్షణతో ఉన్నారు. చాల జాగ్రత్తగా మెసిలారు. పాపం చిన్న కూనల్ని చూస్తే జాలేసింది. ఇంకా ఇట్లాంటివి ఎన్ని ఎదుర్కోవాలో!

అందరం ఐదింటికల్లాలేచి స్టేషన్‌కు బయల్దేరాం. ఆరింటికిపేదో ప్యాసింజర్ ఉందంటే దాంట్లో పోదామనుకున్నాం. స్టేషన్ దగ్గరికెళ్తే చాల మంది పోలీసులు కనిపించారు. కొందరు లోపలికిపోతే టికెట్ లేదని కొట్టి తరిమేశారు. ఇక ఇక్కడ ఉంటే లాభం లేదనిపించింది. ఇంతమందికి టికెట్ తీసుకోవడానికి డబ్బుల్లేవు. అది అసాధ్యం. పోనీ, పక్కస్టేషన్ చింతలపల్లి వరకూ నడచిపోయి రైలు ఎక్కుదామనుకున్నాం. కాని తర్వాత తెలిసిందేమిటంటే మిగతా స్టేషన్లలో కూడా అరెస్టులు చేస్తున్నారు. ఖమ్మం దగ్గర తప్పని సరిగా సోదాచేస్తున్నారు. ఇక రైలులో వెళ్ళడం అసాధ్యం.

ఇక మిగిలిందల్లా ఒకటే- టూరిస్టు బస్సు మాట్లాడుకుని వెళ్ళటం. కనుక్కుంటే ఛార్జీలు ఎక్కువగానే ఉన్నాయి గాని గత రాత్రి అనుభవాలు దృష్టిలో పెట్టుకుంటే మరోరాత్రి వరంగల్‌లో గడపడం క్షేమకరం కాదనిపించింది. ఇద్దరు కామ్రేడ్స్ వెళ్ళి ఐదింటికల్లా బస్సు తీసుకువచ్చారు. రోజంతా ఎవరూ ఏమీ తినలేదు. ఆ సమయంలో ఆకలి గుర్తేలేదు, అక్కడినుంచి బైట పడితే చాలు నన్నట్టుంది.

ఖమ్మం దాటేవరకు బస్సు ఎక్కడ ఆపుతారోనని గుండెల్లో భయం. మధ్యలో ఓ చోట ఆపనే ఆపారు. అడిగితే వేయిస్తంభాల గుడి చూడటానికి వెళ్ళి వస్తున్నామని చెప్పి బైటపడ్డాం. మొత్తానికి అలా శత్రు నిర్బంధం బారి నుంచి బైటపడ్డాం. వరంగల్ నిర్బంధాన్ని మేం ముఖాముఖీ ఎదుర్కోక పోయినా దాని నాడి, దాని ఉద్వేగం అనుభవించాం. అదే గగుర్పాటు కలిగించేట్టుగా ఉంది. అసలు నిర్బంధాన్ని ప్రత్యక్షంగా అనుభవిస్తూ కూడా, పని చేస్తున్న వరంగల్ కామ్రేడ్స్ సాహసం పట్ల మాకు గొప్ప గౌరవం కలిగింది. వాళ్ళ మీద నిర్బంధం తగ్గాలంటే ఇతర ప్రాంతాల్లో కూడా ఇంకా ఉత్తేజంతో పనిచేసి శత్రుకేంద్రీకరణను దెబ్బతీస్తేగాని సాధ్యం కాదనే కొత్త పాఠాన్ని మాకీ అనుభవం నేర్పింది.

సంస్మరణ :

# స్త్రీ పురుష సంబంధాలు - ఉప్పల లక్ష్మణరావు దృక్పథం

ఓల్గా



ఉప్పల లక్ష్మణరావుగారు నవలా రచయితా అనువాదకులు. తెలుగు-రష్యన్ నిఘంటు సంపాదకులు. ఇంకా సమాజానికి ప్రయోజనకరమైన పను లెన్నో చేశారు వారి సాహిత్యమూ జీవితమూ కూడా విశిష్టమైనవి. తాను నమ్మిన విషయాలు రాయటమే కాక ఆచరించగల వ్యక్తి. స్వాతంత్ర్యముంతోనూ, కమ్యూనిస్టుపార్టీతోనూ సన్నిహిత సంబంధాలు గల వ్యక్తి. స్త్రీ సమస్యల గురించీ స్త్రీ పురుష సంబంధాల గురించీ ఎంతో అభివృద్ధికరమైన ఆలోచనలు చేసిన రచయిత. తన జీవిత కథ అయిన 'బతుకు పుస్తకం'లో ఈవిషయం గురించి ప్రస్తావించారు.

"సామాజిక సంబంధాలలోనూ, ముఖ్యంగా స్త్రీ - పురుష సంబంధాల గురించీ నాలో తీవ్రమైన భావాలు స్పష్టమైన రూపంలో స్థిరపడ్డాయి. ఈ నా సామాజిక భావాలకూ, సోషలిస్టు విప్లవ సామాజిక భావాలకూ నా దృష్టిలో అవినాభావ సంబంధం వుంది. అంతేకాకుండా కమ్యూనిస్టు సమాజ స్థాపన విజయవంతంగా స్థిరపడాలంటే సామాన్య ప్రజలలో నైతేనేమీ మధ్య తరగతి ప్రజల్లో నైతేనేమి మేధావులలో అయితేయేమీ యీ స్త్రీ స్వాతంత్ర్యం స్త్రీ పురుష ఆర్థిక, సామాజిక, వైవాహిక సంబంధాలలో విప్లవాత్మకమైన మార్పులు వస్తేనేగాని అట్టి విప్లవాత్మక సమాజం మనలేదు. నాకున్న ఈ భావాలను రచయితగా నేను ప్రచారం చేయగలనా? నేను రాసిన అతడు – ఆమెలో లీలామాత్రంగా ఈ భావాలను సూచించాను" అని తన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పారు.

'అతడు - ఆమె'లో శాంతం పాత్రను ఆయన యెంతో ఆదర్శవంతంగా సృష్టించారు. సామాజిక జీవితంలోనూ కుటుంబ జీవితంలోనూ ప్రజాతంత్ర భావా

లను నమ్మి ఆచరించిన స్త్రీ పాత్రను ఆ రోజుల్లోనే చిత్రించటం రచయితగా లక్ష్మణ రావుగారి ప్రత్యేకత. స్త్రీలకు సంబంధించిన అనేక సమస్యలను ఆయన ప్రస్తావించారు. చిన్నతనంలోనే వివాహాలై లైంగిక జ్ఞానం లేక గర్భవతులై ప్రాణాలు పోగొట్టుకునే స్త్రీల దయనీయ పరిస్థితి గురించి రాశారు. గర్భ విచ్ఛిత్తి చట్టసమ్మతం కావాలనే వాదన శాంతంచేత చేయించారు. ఎంత పెద్ద చదువులు చదివినా స్త్రీలు తమ శరీరం గురించి అజ్ఞానంలో వుండే స్థితి పోవాలని కోరుకున్నారు. సెక్సు విషయాల్లో తమ భార్యలు అమాయకంగా అజ్ఞానంగా ఉండాలని కోరుకునే పురుష మనస్తత్వాన్ని విమర్శించారు. ఆర్థిక స్వేచ్ఛ లేనిదే స్త్రీల బానిసత్వం పోదని తమ జీవితానుభవం ద్వారా తెలియజెప్పే స్త్రీ పాత్రలనూ ఆత్మగౌరవంతో ప్రవర్తించే స్త్రీ పాత్రలనూ సృష్టించారు. స్త్రీల రక్షణభారం తమ భుజాలమీద వుందని భావించుకునే పురుష మనస్తత్వాన్ని దుయ్యబట్టారు. స్త్రీ తన శరీరానికీ మనసుకీ తానే అధిపతి అనీ, యితరుల పెత్తనాన్ని సహించకూడదనీ చెప్పి స్త్రీని గౌరవించారు. అన్నిరంగాల్లోనూ స్త్రీ పురుషుల మధ్య సమానత్వాన్ని ప్రతిపాదించారు. ఈ కుటుంబ వ్యవస్థ స్త్రీ నెంత హీనంగా చూస్తోందో దిక్కులేని స్థితిలో వుంచుతోందో అర్థమయ్యేలా చేశారు. తల్లిదండ్రులూ పిల్లలూ స్నేహభావంతో జీవించే విధానాన్ని మనకు పరిచయం చేశారు.

స్త్రీ పురుషుల మధ్య ఏర్పడే ప్రేమ గురించి చాలా అభివృద్ధికరమైన ఆలోచన వీరిది. స్త్రీ పురుషుల మధ్య ప్రేమకు కారణం భావైక్యత అనే విషయం ఈనాడు చాలా మంది అంగీకరిస్తున్నారు. లక్ష్మణరావుగారు ఆ భావైక్యతతోనే సంతృప్తి పడరు. తమకున్న భావాలను వ్యక్తులు ఎలా ఆచరణలో పెడతారు, ఎదురొచ్చే సమస్యలనూ కష్టాలనూ ఎట్లా ఎదుర్కొంటారు అన్న విషయం కూడా తెలుసుకోవాలంటారు. అలా తెలుసుకోవటం 'సమిష్టి కృషి' వల్ల సాధ్య పడుతుందనీ, ప్రేమించుకున్నామనుకునే వారు యేదో ఒక పనిని కలిపి చేయటం ద్వారా, కొన్నాళ్ళు సన్నిహితంగా జీవించి ఒకరినొకరు గమనించటం ద్వారా ఒకరి వ్యక్తిత్వాన్ని ఒకరు తెలుసుకోవాలంటారు. ఇద్దరి జీవిత ప్రధాన ధ్యేయాలూ ఒకటి కావాలంటారు. ప్రేమను గురించి అస్పష్టతా అయోమయం లేకుండా భావవాద ఛాయలు లేకుండా ప్రేమ కున్న భౌతిక పునాదిని వివరించే రచన చేసిన రచయితలలో లక్ష్మణరావుగారొకరు. భౌతిక కారణాలవల్లా పరిస్థితుల వల్లా యేర్పడిన ప్రేమ ఆ భౌతిక కారణాలూ పరిస్థితులూ మారినప్పుడు మారిపోవచ్చని చెబుతారు ఒకసారి ప్రేమ కలిగాక

అది నశించదనుకోవటం పొరపాటనీ స్త్రీ పురుష లిద్దరూ ఆ ప్రేమను బ్రతికించుకునే క్రమంలో ఒకరినొకరు అభివృద్ధి చేసుకోవాలనీ ఆయన అభిప్రాయం "ప్రేమ కంటే మాతృత్వవాంఛే ముందు పుట్టు కొస్తే?" — ఇటువంటి సున్నితమైన సమస్యలను ప్రస్తావించి, యిటువంటి విషయాలు మాట్లాడటమే పాపమనే తప్పనే అభిప్రాయాన్ని పోగొట్టే ప్రయత్నం చేశారు.

స్త్రీ స్వేచ్ఛ గురించీ స్త్రీ పురుషుల సంబంధాల గురించీ ఈయన అభిప్రాయాలు రచనల్లో ఆగిపోలేదు. వీరి వ్యక్తిగత జీవితంలో కూడా ఆ అభిప్రాయాలను ఆచరణలో పెట్టారు. మెల్లీగారు వివాహ ప్రస్తావన తీసుకొచ్చినపుడు లక్ష్మణరావు గారు ఆమెను భారతదేశం వచ్చి అన్ని పరిస్థితులూ గమనించమనీ, అన్ని గమనించాక కూడా తననింకా ప్రేమిస్తే అప్పుడు వివాహం చేసుకుందామని అన్నారు. మెల్లీగారు భారతదేశం వచ్చాక యిద్దరూ అనేక వుద్యమాలలో కలిసి పనిచేసి ఆ తరువాతే వివాహం చేసుకున్నారు. వారు తమ వివాహం మాస్కోలో జరగాలనుకున్నారు. దానికి కారణం మెల్లీగారిలా రాశారు. "ఏ దేశంలో అయితే స్త్రీకి పురుషునితో అన్ని జీవిత రంగాలలోనూ సమాన ప్రతిపత్తి వుందో- సామాజిక ఆర్థిక, విద్యా, సాంకేతిక ఆధ్యాత్మిక, వైవాహిక రంగాల్లో సమాన ప్రతిపత్తి వుందో- వైవాహిక జీవితంలో కాలు పెట్టడానికి యిద్దరికీ పూర్ణ స్వాతంత్ర్యం వుందో, వైవాహిక జీవితం నుంచి విడివడటానికి కూడా సమాన హక్కు వుంటుందో అట్టి సోవియట్ దేశంలోనే మన వివాహం జరగాలని" మెల్లీగారు అనుకున్నారు. లక్ష్మణరావుగారు సంతోషంగా అంగీకరించారు.

"మన వివాహానికి పునాది పరస్పర ప్రేమ. పరస్పర గౌరవం. సముష్టి కృషి వల్ల కల్గిన పరస్పర సదవగాహన. మనకి సోవియట్ పద్ధతి ప్రకారం విడాకులకి సులభమైన సరళమైన వ్యవహారకాండా, సమాన హక్కు సంక్రమించాయి. ఇవి సంక్రమించిన తర్వాతే పెళ్ళి. పెళ్ళి పై పునాదిపై జరిగితే సుఖమయ జీవితం అనుభవించుతాం" అనుకున్నారు.

## 'రాజద్రోహం వర్ధిల్లాలి!'

పంజాబ్ సమస్యను ఒక మతోన్మాద సమస్యగా చిత్రించి, అదిసాకుగా అక్కడి ప్రజాతంత్ర ఉద్యమాన్నేకాదు, 'టెరరిజం' మిూచితో దేశవ్యాప్తమైన ప్రజాతంత్ర ఉద్యమాన్నే ఉక్కుపాదంతో తొక్కివేయాలని చూస్తున్న కేంద్ర ప్రభుత్వం తలకిందులైన సమస్యలను సరిచేసి నిలబెట్టిన వాళ్ళ మీద విరుచుక పడుతున్నది.

ఇందిరాగాంధీ, జెయిల్‌సింగ్, దర్బార్‌సింగ్‌లు భింద్రన్‌వాలను సృష్టించిన నాటి నుంచీ అటు కేంద్రప్రభుత్వ రాజ్యం హింసనూ, ఇటు అదే సృష్టించి మరో పాత్రగా అభినయింపచేస్తున్న మతోన్మదహింసనూ నిర్భయంగా పంజాబ్ గ్రామ సీమల్లో బహిర్గతం చేస్తూ ప్రచారం చేస్తున్న ప్రజాస్వామిక శక్తులున్నాయి. కేంద్రానికి నిజమైన భయం ఈ శక్తులనించే.

ఢిల్లీలో సిక్కులపై కాంగ్రెస్ ఐ నాయకత్వంలో పనిగట్టుకొని జరిగిన మారణకాండను Who are the Guilty (ఎవరు దోషులు) అనే పేరుతో విశ్లేషించిన ఢిల్లీ పియుసిఎల్ పియుడిఆర్ సంస్థలు ఆ పుస్తకం రెండవ ముద్రణకు ముందు మాట రాస్తూ ఈ విషయాన్నే ప్రజల దృష్టికి తెచ్చాయి.

---

మహిళల హక్కుల కోసం మెల్లీగారు లక్ష్మణరావుగారూ గాంధీగారి సబర్మతీ ఆశ్రమంలోనే ఆందోళన సాగించారు. ఆశ్రమంలో రాత్రిపూట పాములు పట్టే పని స్త్రీలకు నిషేధం. భారతీయ స్త్రీలకు అలాంటి ధైర్య సాహసాలు లేవని గాంధీగారి అభిప్రాయం. మెల్లీగారు ఈ నిషేధాన్ని ఎదిరించి, జైల్లోవున్న గాంధీగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి స్త్రీలను కూడా పాములు పట్టే పనిలో ప్రవేశ పెట్టటానికి అనుమతి సంపాదించారు. లక్ష్మణరావుగారు క్విట్ ఇండియా వుద్యమాన్ని వ్యతిరేకించినా. క్విట్ ఇండియా వుద్యమంలో మెల్లీగారు పాల్గొనడంలో సహకరించారు.

ఈ రకంగా రచనలోనూ జీవితంలోనూ పురుషులు స్త్రీలకన్న అధికులనే పురుషాహంకారం లేకుండా, స్త్రీ పురుషుల సమానత్వాన్ని నమ్మి ఆచరించిన 'మానవుడు' లక్ష్మణరావుగారు.

రాజ్యం తాను అదుపూ హద్దులేని హింసను సమాజంలోని ఒకసెక్షన్‌పై అమలు చేస్తూ, తానే ప్రోత్సన్నంగా సమాజంలోని రెండుసెక్షన్‌ల మధ్య ఘర్షణలూ హింసా రెచ్చగొడుతూ ప్రజాస్వామ్యవాదుల దృష్టిని అటు మళ్ళించి తన హింస కు ఆమోదాన్ని పొందాలని చూస్తుంది నువు రాజ్యంహింసను నీకున్న శక్తినంతా వినియోగించి ఖండించి ప్రతిఘటించే తరుణంలో నీముందుకు మతకలహాలు అన బడే హింసా చర్యల్ని తెచ్చి - వీటిగురించి నీవైఖరి ఏమిటి? అని నిలదీస్తుంది. టెర్రరిస్టులు హిందువుల్ని చంపుతుంటే అప్పుడు మీరేంచేసారు? అని ప్రభుత్వం తనకు ప్రయాసలేకుండానే ప్రశ్నించే మేకావుల్ని ఎందరినో తన ప్రచారంతో సృష్టి స్తుంది ఈ మతకల్లోలాలు అనబడే దాని వెనుక, ఈ 'టెరరిజం' వెనుక పాలక వర్గ అదృశ్య హస్తమే వున్నదని మొదటి నుంచీ నువు ఎలుగెత్తి చాటకపోతే రాజ్యంహింసను ఖండించాల్సివచ్చినపుడు నిజంగానే నువు డిఫెన్స్‌లో పడిపోతావు.

'ఎవరు దోషులు' పుస్తకాన్ని పంజాబీ భాషలో ప్రచురించిన అసోసియేషన్ ఫర్ డెమక్రిటిక్ రైట్స్ నాలుగేళ్ళుగా రాజ్యం హింసనూ, అదే సృష్టించి ప్రోత్స హిస్తున్న మతోన్మాదహింసనూ ప్రతిఘటిస్తున్నది. అందుకే పంజాబ్ ప్రభుత్వం ఆ పుస్తకాన్ని పంజాబ్‌లో నిషేధించింది. పంజాబీ భాషలో దానిని ప్రచురించిన ఎఎఫ్‌డిఆర్ కార్యదర్శి డాక్టర్ జగ్‌మోహన్ సింగ్ పై 'రాజద్రోహ' నేరాన్ని మోపింది.

ప్రజాస్వామిక హక్కుల సంఘం ప్రచురించిన ఒక పుస్తకాన్ని నిషేధించి రాజద్రోహ నేరం మోపడం బహుశా దేశంలో ఇదే మొదటిసారి (బాలగోపాల్‌పై బాంబుల కేసు పెట్టినందుకు అసలు ఎన్టీఆర్‌ను పంజాబ్‌గవర్నరుగా వేయాల్సింది.)

Who are the Guilty అనే పుస్తకాన్ని తెలుగులోనూ, దేశంలోని అన్ని భాషల్లోనూ ప్రచురించి ప్రచారం చేయడం ద్వారా దోషుల దోషాలను దేశవ్యాప్త ప్రచారం చేయాలనీ దోషుల్ని నిర్భయంగా వేలెత్తి చూపినందుకు వేటాడబడుతున్న ప్రజాతంత్రవాదులకు అండదండలివ్వాలనీ ప్రజాతంత్రవాదులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

— 'సాహితీమిత్రులు'

# ఎన్‌కౌంటర్ హత్యలు

లోక్‌సభ అసెంబ్లీల ఎన్నికల సందర్భం ఒక ఆంధ్రప్రదేశ్‌లోనే కాదు మూడు రాష్ట్రాల్లో ప్రభుత్వాలకు ఎన్‌కౌంటర్ల లైసెన్సునిచ్చింది. అవి మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలో కాంగ్రెస్ ప్రభుత్వాలు కావచ్చు. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం ప్రభుత్వం కావచ్చు.

అయితే ఆదిలాబాద్ కరీంనగర్ రైతాంగ పోరాట విస్తరణను అరికట్టాలనే పాలకవర్గ ఆందోళన మాత్రం ఈ ఎన్‌కౌంటర్లకు ఏకసూత్రతను సాధిస్తున్నది. కామ్రేడ్ ఖైరి గంగారాం ఎన్‌కౌంటర్ మొదలుకొని కామ్రేడ్ వెంకటేశ్వరరావు (చంద్రన్న) ఎన్‌కౌంటర్ వరకు మూడు నెలల కాలంలో మూడు రాష్ట్రాల్లో జరిగిన నాలుగు ఎన్‌కౌంటర్లు మహారాష్ట్రలోని భామ్రాగడ్ మీదుగా మధ్యప్రదేశ్‌లోని బస్తర్ వరకు విస్తరించిన జగిత్యాల ప్రజాపంథాను ఎదుర్కోవడానికి పాలకవర్గాలు చేస్తున్న విఫల ప్రయత్నాలే.

1985 మళ్ళీ ఎన్‌కౌంటర్ హత్యలతో ప్రారంభమైనట్లుగా కనిపిస్తున్నది. జనవరి 21న కరీంనగర్ జిల్లాలో కా॥ ఖైరి గంగరాంను కాల్చి చంపారు.

ఫిబ్రవరి 7న మహారాష్ట్ర మధ్యప్రదేశ్ సరిహద్దుల్లో గుండంవాగు గోదావరిలో కలిసేచోట కా॥ శివకుమార్‌ను కాల్చివేశారు. కా॥ శివకుమార్ 1978లో ఉప్పుమడిగెలో లేచిన మంటలకు నాయకత్వం వహించి 81లో మహదేవ్‌పూర్ అడవి ప్రాంతానికి, 82లో మహారాష్ట్ర ఆదివాసి ప్రాంతానికి ఆ క్రమంలోనే మధ్యప్రదేశ్‌లోకి పోరాటం నిర్మించడానికి వెళ్ళాడు.

మార్చి 5వ తేదీన దళ నాయకుడు కా॥ గణపతిని మధ్యప్రదేశ్ 'రాత్‌వాలా' (మధ్యప్రదేశ్ పోలీసు నిర్వహిస్తున్న ప్రత్యేక పోలీస్‌దళం రాత్రులందు సంచరించేవారు అని అర్థం) పోలీసులు బస్తర్ ప్రాంతంలో కాల్చి చంపారు. గడ్‌చిరోలి జిల్లా నారాయణపూర్ తహసీల్‌లో తాల్‌బేడీ గ్రామానికి సమీపంలోనే వున్న మధ్యప్రదేశ్ సరిహద్దుల్లో ఈ ఎన్‌కౌంటర్ హత్య జరిగింది. కా॥ గణపతి వరంగల్ పరిసరాల్లోని సోమిడి గ్రామస్తుడు. రాడికల్ యువజన సంఘంలో చేరి క్రమంగా అడవి ఉద్యమంలోకివెళ్ళి దళనాయకుడై కా॥ బాలన్నగా ఆదివాసుల ప్రేమనుచూరగొన్నాడు.

కా॥ చంద్రన్నగా భద్రాచలం గిరిజనుల హృదయాల్లో చోటుచేసుకున్న కా॥ అర్వపల్లి వెంకటేశ్వరరావును మార్చి 29న ఖమ్మం పోలీసులు భద్రాచలం అడవుల్లో కాల్చి చంపారు. తీవ్ర అస్వస్థతతో ఒకచోట ఆశ్రయం తీసుకుని చికిత్స పొందుతున్న ఈ దళనాయకుడ్ని ఆచూకి తెలిసిన పోలీసులు 24 తుటాలు పేల్చి కాల్చివేసినట్లుగా తెలుస్తున్నది. ఖమ్మంలో 79లో రాడికల్ యువజన సంఘ మహాసభలు నిర్వహించే క్రమంనుంచి భద్రాచలం నుంచి బస్తర్‌దాకా గెరిల్లా పోరాటానికి తన నెత్తుటితో బాటలు వేసేదాకా ఈ కామ్రేడ్ ఎదిగాడు.

# సృజనవద్ద అమ్మకానికి సిద్ధంగావున్న పుస్తకాలు

1. లూసన్ సాహిత్య జీవితం - (విరసం) 1.00
2. పోరాటాల శ్రీరాములు - కవితలు " 0.75
3. గంజినీళ్ళు - నాటిక - చెరబండరాజు " 1-50
4. AILRC Souvenir 15-00
5. ప్రజల పాటలు - గద్దర్ మాటలు (JNM) 1.00
6. Sri Sri New frontiers 15-00
7. ప్రజాసాహిత్యం, కళలు ఎలా వుండాలి? - వర్గీస్ వ్యాసాలు (సృజన) 2.00
8 బొగ్గు పొరల్లో - కార్మిక కథలు - (కెవిటి) 5.00
9. సృష్టికర్తలు - అల్లం రాజయ్య కథలు 5.00
10 అనామకుడి డైరీ - కె. రాంమోహన్‌రాజు - కథలు 5-00
11. రోడ్డు మీద సూర్యుడు " - కవితలు 3.00
12. స్తబ్దత - చలనం - పాపినేని శివశంకర్ - " 3-00
13. చర్య - కవితలు - సాగర్ 2.00
14. పాట వెన్నెల మీద నడుస్తుంది - అజ్ఞాత సూరీడు - కవితలు 3.00
15. అల్లం వీరయ్య పాటలు 1.50
16. జననాట్యమండలి పాటలు 3-00
17. సముద్రం - వరవరరావు 2-00
18. తెలంగాణా విమోచనోద్యమం - తెలుగునవల - వరవరరావు
(సాదా ప్రతులు అయిపోయినవి) మేలుప్రతి 50.00
19. తుడుం - ఇంద్రవెల్లి కవితలు - విరసం 1-25
20. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - శేషేంద్రకు జవాబు -
త్రిపురనేని మధుసూదనరావు 1.00
21. అమరుడు సరోజ్‌దత్తా రచనలు-అను. ఆలూరి భుజంగరావు మొదటిభాగం 1-50
22. " " " రెండవభాగం 2.00
23. పౌరహక్కుల ఉద్యమంపై పోలీసుల దాడి (APCLC) 1.50
24. అసంఘటిత పోరాటాలు — 1.50
25 అప్రకటిత అంతర్యుద్ధం — 2-00
26. తరతరాలుగా సాగుతున్న వీరోచిత రైతాంగ పోరాటాలు 2.00
27. రష్యాలో వర్గ పోరాటాలు — బెతెల్‌హామ్ 1.50
28. రగులుకొనే రాక్షసిబొగ్గు — సురా 5-00
29. మునుముందుకు సాగుతున్న రైతాంగ పోరాటాలు —
చుట్టు ముడుతున్న ప్రభుత్వ నిర్బంధ కాండ 3-00
30. భారత స్వాతంత్ర్య పోరాటాలు - కెవిఆర్ 2.50

SRJANA Telugu Monthly March/April '85 H/HNK-3
Regd. No. with Registrar of Newspapers 10953/67



SRJANA
Hanumakonda 506 001.
This copy Rs. 4-00
Yearly Subscription Rs. 30/-